# శ్రీమద్రామాయణ కల్పవృక్షము
# శబరి పాత్ర —
## ఒక పరిశీలన



జి. కుమారస్వామి నాయుడు

# శ్రీమద్రామాయణ కల్పవృక్షము శబరి పాత్ర — ఒక పరిశీలన

కేంద్ర విశ్వవిద్యాలయం యం.ఫిల్. పట్టానికై
సమర్పించిన సిద్ధాంత వ్యాసం
**1983**

## జి. కుమారస్వామి నాయుడు

పర్యవేక్షకులు
**ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం**
కేంద్ర విశ్వవిద్యాలయం
హైదరాబాద్.

ప్రచురణ : 126

ప్రథమ ముద్రణ : 1990 మార్చి

ప్రతులు : 1000

ముఖచిత్రం : **సుధామ**
ఆకాశవాణి, హైదరాబాద్ కేంద్రం.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029.

ముఖచిత్ర ముద్రణ :
**బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్**
చిక్కడపల్లి, హైదరాబాదు - 500 020.

ప్రతులకు :

**యువభారతి కార్యాలయం**
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల : రూ. 18-00

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ప్రచురించబడింది.

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం
డీన్ ఫ్యాకల్టీ ఆఫ్ హ్యూమానిటీస్
హైదరాబాద్ యూనివర్శిటీ
సెంట్రల్ యూనివర్శిటీ పోస్టు, హైదరాబాద్

# ఒక ఒరవడి

సమాజంలో సాహిత్య చైతన్యాన్నీ, సాహిత్య సదవగాహననూ పెంపొందించి, ఉత్తమ సాహిత్యాన్ని సహృదయులకు అందించటంలో కడచిన ఇరవై అయిదేళ్ళుగా యువభారతి దీక్షతో కృషిచేస్తున్నది. 1990 యువ భారతి రజతోత్సవ సంవత్సరం. ఈ యేడాది పొడుగునా విశేష కార్యక్రమాలను, సాహిత్య ప్రచురణలనూ సహృదయులకు సమర్పిస్తున్నది.

మనకున్న అపార సాహితీ సంపదను సమకాలీన చైతన్య స్పృహతో సమీక్షించుకోవడం ప్రతి తరం చేసేపని. కడచిన పాతికేళ్ళుగా యువ భారతి సమాజంలో ఉత్తమ ప్రమాణాలతో కూడిన సాహితీ స్పృహను కల్పించడానికి ఎన్నో ప్రయోగాలు చేసింది. లహరీ ఉపన్యాస వ్యాస పరంపర, రచన, మహతి లాంటి యుగ సమీక్ష గ్రంథాల ప్రచురణ యువభారతి ప్రజల కందుబాటులో ఉండే సాహితీ రచనలను 125 ప్రచురించింది. రజతోత్సవ సంవత్సరంలో మరో 25 ప్రచురణలను అందించాలని ఆశిస్తున్నది. యువభారతి సాగించే ఈ సాహిత్యోద్యమంలో పాలుపంచుకోవటానికి, భారతీ భూషణ, భారతీ మిత్ర సాహితీ మిత్ర పథకాలున్నాయి. సహృదయులందరికీ ఇదే మా ఆహ్వానం. రజతోత్సవ సమాహ్వానం.

ఒక కుటుంబంలో సభ్యు డెలాగో ఒక కావ్యంలో పాత్ర అలా. కుటుంబ సభ్యుణ్ణి పరిచయం చేయాలంటే వ్యక్తిగా అతని కెంత ప్రాముఖ్యం ఉంటుందో సమష్టిగా అతని జీవితానికి కుదురైన ఆ కుటుంబానికి కూడా అంత ప్రాముఖ్యమూ ఉంటుంది. అంటే వ్యక్తి వ్యష్టిగా పరిచ్ఛిన్నంగా కనపడుతున్నా ఒక సమష్టిలో ఒక పరిపూర్ణతలో భాగంగా లోకంలో జీవిస్తాడు. ఇది లోకం సంగతి,

కావ్యం కూడా మరో లోకం. ఆ లోకంలో జీవించే పాత్ర కూడా అలాగే సమష్టి లోని వ్యష్టిగా ఒక పరిపూర్ణంలోని పరిపూర్ణతత్త్వంలా జీవిస్తుంది. ఒక పాత్రను కదిలిస్తే - తీగె లాగితే డొంకంతా కదిలినట్లు - కావ్యమంతా పరిశీలనలోకి వస్తుంది. చిక్కగా అల్లుకుపోయిన తీగెను చెట్టునుండి విడతీయడం ఎంత కష్టమో కావ్యజీవితంలో కలిసిపోయిన పాత్రను విడదీసి వివేచించటం కూడా అంతకష్టమే. తీగె అనగానే అందులో పాదు, విత్తు, వేళ్ళు, భూసారం. ఎదుగు, ఏపు, ఆధారం, ఆలంబనం, దోహదం, చిగురు, పూత, కాపు, సొగసు, వైభవం - ఇలా ఎన్నో అంశాలు సహజంగా ఒదిగి ఉంటాయి. అలాగే పాత్ర అనగానే ఆమె పుట్టుక, కుటుంబం, తల్లిదండ్రులు, వాతావరణం,పోషణ, పెంపకం, చదువు, సంస్కారం, సాధన, లక్ష్యం, శీలం, జీవితసాఫల్యం - ఇలా ఎన్నో విశేషాలు పరిశీలనకు వస్తాయి. మొత్తానికి ఒక కావ్యమెంత పరిశీలనార్హమో ఒక పాత్రకూడా అంతే పరిశోధనార్హమౌతున్నదన్న మాట!

మిత్రులు శ్రీ జి. కుమారస్వామినాయుడుగారు నాకు దాదాపు పదిహే నేళ్ళుగా తెలుసు. వారి నిజాయితీ, సూటిదనం, శ్రద్ధ, స్నేహభావం మా యిరు వురి స్నేహాన్ని పెంపొందించాయి. వారు హైదరాబాదు విశ్వవిద్యాలయంలో ఎం. ఫిల్., పరిశోధనకోసం చేరటం, శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని శబరి పాత్రను గురించి పరిశోధన ప్రారంభించటం, వారి పరిశోధనను పర్యవేక్షణ చేసే అవకాశం విశ్వవిద్యాలయంవారు నాకు కల్పించటం - ఇవన్నీ ఈ గ్రంథంతో నాకు సన్నిహిత పరిచయం ఏర్పడటానికి దోహదం చేశాయి. శ్రీ నాయుడుగారు సంప్రదాయ సాహిత్యం మీద అపారమైన ఆదర గౌరవా లున్నవారు. భక్తితో తమ శక్తియుక్తులను పెంచుకొనే ప్రవృత్తి వారికి సహజం. సహజంగా సమాజంలో వెనుకబడిన వర్గాల పట్ల నాయుడుగారికి ఎంతో సానుభూతి. వారి యోగక్షేమాలను, అభివృద్ధినీ ఎల్లప్పుడూ కోరుతూ ఉంటారు; వారికొరకై చిత్తశుద్ధితో కృషి చేస్తూ ఉంటారు. బహుశః ఇటువంటి వారి మానసిక ప్రవృత్తి శబరి పాత్రను గురించి పరిశోధన చేయటానికి వారిని ప్రేరేపించి ఉంటుందని భావిస్తున్నాను.

ఒక కావ్యంలోని పెద్దపాత్రలను పరిశీలించటం ఒక యెత్తు; చిన్న చిన్న పాత్రలను పరిశీలించటం మరొక యెత్తు. ఒక మహాయంత్రంలో పెద్ద పెద్ద

భాగాలు ఉండవచ్చు అవన్నీ పనిచేస్తేనేగాని ఆ యంత్రం నడవకపోవచ్చు. అయితే, ఆ యంత్రభాగాలు ఎంత పెద్దవైనా అవి పనిచేయటానికి ఒక నట్టు,ఒక బెట్టు కీలకమైన పాత్ర నిర్వహించవచ్చు కావ్యంలో కూడా అలాగే కీలక పాత్ర లను నిర్వహించే చిన్నపాత్ర లుంటాయి. రామాయణంలోని చిన్న పాత్రలను రెండురకాలుగా వివేచించవచ్చు. ఒక రకం పాత్రలు కథాగతికి తోడ్పడేవి; మరొకరకం కథాప్రవృత్తికి పోషకంగా ఉండేవి. కథాగతికి మాత్రమే తోడ్పడే వాటిలో ముఖ్యంగా పేర్కొనదగిన స్త్రీపాత్రలు - మంథర, శూర్పణఖ, వీరు కథలో కొద్దికాలమే కనపడుతున్నా కథాగతికి ప్రాణచైతన్యాలుగా గోచరిస్తారు. అసలు వీరిరువురూ లేకపోతే రామాయణకథయే లేదన్నంత కీలక పాత్రలుగా ప్రసిద్ధికెక్కారు. ఇక రెండవరకం పాత్రలలో మొదట పేర్కొనదగిన స్త్రీపాత్ర శబరి. రామకథ రసపరంగా ఎంత గొప్పదో, ఆధ్యాత్మిక ప్రస్థావనంగా అంత విశిష్టమైనది. రామాయణం ఒక మహాశరణాగతి. భక్తి ప్రపత్తులతో భగవంతుని చేరే ఆధ్యాత్మిక ప్రస్థానంలో సేవాయోగానికి, ఆత్మసమర్పణ భావానికీ శబరి పాత్ర సజీవోదాహరణం. అయితే, శబరి కథాగతికి కూడా తోడ్పడుతుంది. అలా తోడ్పడకపోతే కథాగతమైన పాత్ర కాజాలదు. కథాగతి కంటె ప్రవృత్తిని విశేషించి పోషించటం ఈ పాత్ర ప్రత్యేకత! అందువల్లనే పరిశీలనకు పాత్రమైంది.

శ్రీ కుమారస్వామి నాయుడుగారు ఈ పరిశోధన గ్రంథంలో పాటించిన రచనా ప్రణాళిక శబరివంటి విశిష్టపాత్రను అనుశీలించే పద్ధతికి ఒక రకమైన ఒరవడి పెట్టేదిగా కనపడుతున్నది. ప్రథమ ప్రకరణంలో రామాణంలో శబరి పాత్ర స్వరూప స్వభావాలను గురించి సంగ్రహంగా సారవంతంగా చర్చ సాగింది. ద్వితీయ ప్రకరణంలో అధ్యాత్మ రామాయణంలోని శబరి పాత్ర తత్త్వాన్ని గురించిన సమాలోచనం సమన్వయాత్మకంగా సాగింది. ఒకటి రస పరమైన వ్యాఖ్యానం; మరొకటి తత్త్వపరమైన విచారణం. ఈ రెండింటికీ ఉన్న భేదసాదృశ్యాలను కూడా నాయుడుగారు నిరూపించారు.

ఇక్కడ ఒక అనుమానం రావచ్చు. పరిశోధన రామాయణకల్పవృక్షంలోని శబరిపాత్ర చిత్రణను గురించి కదా! మరి, మొదటి రెండు అధ్యాయాలూ ఎందుకు? అని. ఒకవేళ ఇది అనుమానమే అయితే, సమాధానం చెప్పవలసి వస్తుంది. నాయుడుగారు ఆ అధ్యాయాలు వ్రాసి సమాధానం చెప్పారు. శ్రీమద్రా

మాయణ కల్పవృక్షంలోని రామకథ వాల్మీకినుండి విశ్వనాథవరకూ సాగిన వివిధ కావ్యనాటక వస్తువులు రామకథకు చెప్పిన వ్యాఖ్యానాలనన్నింటినీ పరిశీలించిన తరువాత అభినవంగా అద్వైతపరంగా రామతత్త్వాన్ని కావ్యరస సూత్రముతో వ్యాఖ్యానించటానికి చేసిన విశిష్ట ప్రయత్నం, విశ్వనాథ రచనలో రసం, తత్త్వం, శిల్పం - అనే మూడు ప్రవాహాలు కలిసి త్రివేణీ సంగమం ఏర్పడు తుంది. ఆ మూడు రుచుల ముచ్చటైన వివేచనం రామాయణ కల్పవృక్షంలోని ప్రతిపాత్రకూ వర్తిస్తుంది. ఒక విధంగా భారతీయ కావ్యతత్త్వధారనూ, రామ కథా తత్త్వధారనూ, దార్శనిక తత్త్వధారనూ చారిత్రకంగా, పరిణామదృష్టితో అధ్యయనం చేస్తేతప్ప కల్పవృక్షపు శక్తులు తెలియవు. రామకథకు సంబంధిం చిన భారతీయ సాహిత్య మహావృత్తంలో రామాయణ కల్పవృక్షం స్వయం సమగ్రమైన ఒక కళాతత్త్వ వృత్తం. అందులో ఒక కళాకేంద్రం, తత్త్వ బిందువు, భక్తి సింధువు - శబరి. ఆ పాత్రను గురించి తృతీయ ప్రకరణంలో శ్రీ నాయుడుగారు చర్చించారు. ఆ పాత్ర చిత్రణలోని వైశిష్ట్యాన్ని, వైలక్ష ణ్యాన్ని విడమరిచి వివేచించి విజ్ఞతను ప్రదర్శించారు. శబరి భక్తితత్త్వం గురించి చేసిన వివరణం విలువైనది. చతుర్థ ప్రకరణం చక్కని ముగింపు.

ఈ గ్రంథం చదివితే ఒక లఘుకావ్యం చదివిన అనుభవం పఠితకు కలుగుతుంది; ఒక పాత్రను గురించిన సమగ్ర పరిశీలనాన్ని సమీక్షించిన ఆహ్లాదం పఠితకు మిగులుతుంది; కొన్ని విలువైన అంశాలను సమన్వయాత్మ కంగా సంవదించుకొన్న తృప్తి కలుగుతుంది. ఇంతకన్న ఈ రచనకు మరో ప్రయోజనం ఏం కావాలి !

మిత్రులు శ్రీ జి కుమారస్వామి నాయుడు గారు ఉచితజ్ఞులు. ఏ పని ఎంతవరకు, ఎలా చేయాలో తెలిసిన వివేకవంతులు. ఈ గ్రంథ రచనలో వారి నైపుణ్యం తేటతెల్లమౌతున్నది. చిన్న పాత్రలను పరిశీలించే పద్ధతిలో ఈ చిన్ని రచన ఒక వన్నెగల ఒరవడి! నాయుడుగారికి నా అభినందనలు!

హైదరాబాదు,
22-1-1990.

తెలుగు విశ్వవిద్యాలయం

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఎం.ఎ. పి.హెచ్‌డి. డి.లిట్
ఉపాధ్యక్షులు

కళాభవనం
సైఫాబాదు
హైదరాబాద్-4

5-2-1990

# అభినందన

"రసము వేయిరెట్లు గొప్పది నవకథా దృతిని మించి" అని విశ్వనాథ వారు తమ శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో స్పష్టంగా చెప్పుకున్నా నలిగిన ఆ రామాయణ గాథనే సరికొత్త దృక్కోణాలతో పునర్నిర్మించారు. వినూత్న కథాంశాలు చేర్చడంలోనూ ఉన్న పాత్రలకే అపురూపమైన ఆకృతులను కలిగించడంలోనూ విశ్వనాథవారు సంసిద్ధ హస్తులు. వారి రామాయణంలోని శబరి పాత్రను తీసుకొని శ్రీ జి. కుమారస్వామి నాయుడు గారు ఎం.ఫిల్ పట్టానికి సిద్ధాంత వ్యాసం సంతరించారు. వస్తు వివరణలో, పూర్వభిత్తికా సమున్మేశనలో ఈ రచయిత చక్కని నేర్పు ప్రదర్శించారు.

శబరి పాత్రలోని మౌలికతత్త్వాన్ని సమర్థంగా ఉల్లేఖించారు. విషయ నిర్దేశంతో పాటు కుమారస్వామి నాయుడు గారి శైలీవిన్యాసం కూడా ఈ గ్రంథాన్ని పఠనీయంగా తీర్చిదిద్దినందుకు సంతోషం.

# ధన్యవాదాలు

మనిషి ప్రగతికి మానవత్వమే పునాది ఆదర్శమానవతా విలువలను చాటి చెప్పే మహాకావ్యాల్లో శ్రీమద్రామాయణం ప్రథమ శ్రేణికి చెందింది. ఆదికవి వాల్మీకి తన రామాయణంలో మానవతకు నిండుజీవం పోశాడు. దానిని ధర్మ వృక్షంగా పెంచాడు. వాల్మీకిరామాయణ ప్రభావంవల్ల తెలుగులో అసంఖ్యాకంగా రామాయణాలు వెలువడినాయి. వెలువడుతున్నాయి తెలుగులో వచ్చిన రామాయణాల్లో శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఒక జ్ఞానపీఠం. అందులో ప్రతి పాత్ర ప్రతీకాత్మకమే. ఉపదేశ ఉద్దీపనమే.

ఒక చిన్నపాత్రను తీసుకొని పరిశోధన చేయడం ఒక ప్రయోగం లాంటిది. అందుకే నా పరిశోధనాంశంగా శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో శబరి పాత్రను ఎన్నుకున్నాను.

రామాయణ కల్పవృక్షానికి మూలం వాల్మీకి రామాయణం కనుక తొలి అంశంగా వాల్మీకి రామాయణంలో శబరిపాత్రను గురించి పరిశీలించాను.

అధ్యాత్మ రామాయణ ప్రభావం రామాయణ కల్పవృక్షంపై ఉండడంచేత అధ్యాత్మ రామాయణంలోని శబరిని గురించికూడా అనుశీలించాను.

తెలుగు రామాయణాల ప్రభావం విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షం మీద అంతగా కనిపించకపోవడంచేత ముఖ్యమైన తెలుగు రామాయణాల్లోని శబరిపాత్రను గురించి రేఖామాత్రంగా పేర్కొన్నాను.

ఈ సిద్ధాంత వ్యాసం వ్యావహారిక భాషలో రాసాను. మొత్తంమీద ఈ సిద్ధాంత వ్యాసంలో రామాయణ కల్పవృక్షంలోని శబరిపాత్ర వైశిష్ట్యాన్నీ వైలక్ష్యాన్ని విశ్లేషణాత్మకంగా చూపడం జరిగింది. సహృదయుల ముందు ఈ నా కృషిని సమర్పిస్తున్నాను. వారికి ఏ మాత్రంరుచించి ప్రోత్సహించినా ధన్యమైనట్లే భావిస్తాను.

ఈ అంశాన్ని గూర్చి ఎంఫిల్ పట్టా కోసం అవకాశాన్ని కల్పించి ఈ సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురించుకునేందుకు అనుమతించిన హైదరాబాద్ విశ్వ విద్యాలయం (కేంద్ర విశ్వవిద్యాలయం) వారికి నా ధన్యవాదాలు.

పుత్రవాత్సల్యంతో దీవించి కొండంత సందేహాంధకారాన్నయినా గోరంత హాస దీపంతో రూపుమాపి నా కృషిని పర్యవేక్షించి అమూల్యమైన సలహాలను సూచనలను అందించి "వరవడి" పేరుతో పీఠిక రాసి ఇచ్చిన ఆదర్శ ఆచార్యులు ప్రఖ్యాత విమర్శకులు ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారికి నా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

అరక్షణం తీరిక లేకున్నా నేను అడుగగానే "అభినందన" రాసి ఇచ్చిన జ్ఞానపీఠ బహుమతిగ్రహీత కళాప్రపూర్ణ పద్మశ్రీ ఆచార్య సి. నారాయణ రెడ్డి గారికి నా నమస్సులు.

మంచి మనస్సుతో ఆశీర్వదించి పరిశోధన విషయంలో ముందుకు నడిపించిన ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారికి, డా॥ సి. ఆనందారామం గారికి నా అభినంనాలు.

నిండు మనస్సుతో ఆశీస్సులు అందించి గ్రంథ సేకరణ విషయంలో తోడ్పడిన కీ॥ శే॥ ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారికి, కీ॥ శే॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి నా కృతజ్ఞతలు.

శిష్యవాత్సల్యంతో సర్వ విధాల సహకరించిన ఆచార్య రవ్వా శ్రీహరి గారికి స్నేహశీలి డా॥ తిరుమల శ్రీనివాసార్యుల గారికి శ్రీ శీలావీర్రాజు గారికి విషయసేకరణలో తోడ్పడిన మిత్రులు డా॥ గౌరీశంకర్, మాడభూషి రంగాచార్యులు, చంద్రశేఖర్, సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీమతి శ్రీలక్ష్మి, శ్రీమతి జయప్రభ శమంతకమణి గార్లకు నా ధన్యవాదాలు.

మిత్ర వాత్సల్యంతో తన కుంచతో ముఖ పత్రాలంకరణ చేసి ప్రూఫులు దిద్దడంతో సహా అన్ని విషయాల్లో అనుక్షణం సహకరించిన ఆప్తమిత్రులు శ్రీ సుధామకు హార్దిక కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంత వ్యాస ప్రమరణకు ఆర్థిక సహాయాన్ని అందించి ప్రోత్స హించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి హృదయ పూర్వక ధన్యవాదాలు.

బ్లాకులు తయారుచేసి ఇచ్చిన మోహన్ ప్రోసస్సు వారికి, ముఖ పత్రాన్ని ముద్రించిన శ్రీ బాలాజీ ప్రింటర్సు వారికి, సర్వ విధాల సహకరించి ముద్రించి ఇచ్చిన మిత్రులు శ్రీ శ్రీనివాస్ గారికి, సర్వ విధాల సహకరించిన మా చీఫ్ అకాడమిక్ గైడెన్సీ ఆఫీసర్ డా॥ జి. బి. వి. రామారెడ్డిగారికి, సహ ఉద్యోగులు అందరికి నా ధన్యవాదాలు.

నా కృషికి అండగా నిలిచిన నా శ్రీమతి జి. బి. లక్ష్మికి, చిరంజీవులు, నరేంద్రబాబు, హేమాద్రి చౌదరికి నా ఆశీస్సులు.

# విషయసూచిక

క్ర. సం. పుట.

## IV. చతుర్థ ప్రకరణం

# ప్రథమ ప్రకరణం

## రామాయణ ప్రశస్తి

శ్రీమద్రామాయణం భారతీయ సాహితీ సామ్రాజ్యానికి తలమానికం. విశ్వసాహితీ వియత్తలంలో నిరంతరం వెలుగులు విరజిమ్మే ఇనబింబం.

మమత, మానవత ధర్మతత్పరత, ప్రేమ, వాత్సల్యపరిపూర్ణత, భక్తి నైర్మల్యత సంపూర్ణ పురుషత్వాది సుగుణ సుగంధ పరిమళాలు వెదజల్లే మహా గ్రంథం రామాయణం. సనాతనకాలం నుండి నేటిదాకాకూడా విశ్వజనీనతను సంతరించుకొంటున్న కావ్యరాజం రామాయణం.

భారతీయ ధార్మిక వ్యవస్థకు మూలస్థంబాలయిన శ్రుతి, స్మృతి, సూత్ర రహస్యాలను తన రామాయణంలోని ఆఖ్యానోపాఖ్యాన పాత్ర చిత్రాదులతో సమాజానికి చాటిచెప్పాడు వాల్మీకి మహర్షి.

రామాయణగాధ -
"భద్రో భద్రయా సచమాన ఆగాత్
స్వసారం జారో అభ్యేతి పశ్చాత్
సుప్రకేతై ర్ద్యుభిరగ్ని ర్వితిష్ఠన్
రుశద్భిర్వర్ణై రభిరామ మస్థాంత్" (ఋ. 10 మ. 3.3. సామం 1548)

ఋగ్వేదంలోని ఈ మంత్రంలో మొట్టమొదటి పర్యాయంగా బీజరూపంలో శ్రీరామకథ కనిపిస్తుంది. ఇందలి నాలుగు చరణాల్లో ఆ కథలోని నాలుగు ప్రధాన ఘట్టాలు సంకేతింప బడినాయి. మొదటి పంక్తిలో భద్రుడు అంటే సర్వ మంగళ స్వరూపుడైన రామభద్రుడు, భద్రతో అనగా సర్వమంగళ స్వరూపిణి సీతతో వనమునకు వచ్చాడని రెండవపంక్తిలో జారుడైన రావణుడు సోదరిని దుష్టబుద్ధితో సమీపించాడనీ, మూడోపంక్తిలో ఆకాశాన్నంటే హర్మ్యాలు అగ్ని కాహుతి అయ్యాయనీ, కడపటిపాదంలో తన భయంకరమైన వాహినులతో

(రావణుడు) రాముని ఎదుర్కొన్నాడనీ నిరుక్తకారులు ఈ మంత్రాన్ని నిర్వ చించారు.[1]".

ఋగ్వేదంలో ఉషఃకాంతిలా ఉన్న రామకథ ఉపనిషత్తులలో అరుణోదయ రూపందాల్చింది. వాల్మీకిలో ఉదయార్కబింబమై ప్రభవించింది.

వాల్మీకి మానవత్వపు లోతులను దర్శించినమనీషి. వేదధర్మ సారాన్ని సాకల్యంగా ఆకళించుకొన్న మహర్షి. లౌకిక వ్యవహార మర్మజ్ఞుడైన కవికోకిల. ఆ మహర్షి వేదనలో ఆవిర్భవించిన అపరవేదం వాల్మీకి రామాయణం.

శ్లో॥ వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదం ప్రాచేతసా దాసీత్సాక్షాద్రామాయణాత్మనా॥ [2]

వేదస్వరూపుడైన పరమపురుషుడు రాముడుగా, వేదం రామాయణంగా పరిగణింప బడుతోంది. దీనినిబట్టి రామాయణ ప్రాశస్త్యం ఎటువంటిదో వ్యక్తమౌతుంది. తమ వాఙ్మరాజసంతో ఆదికవి అయిన వాల్మీకిని ఆదికావ్యమైన రామాయణాన్ని నుతించని పూర్వకవు లరుదు.

సాహితీ జగత్తులో కవులను రామాయణేతివృత్తం ఆకర్షించినంతగా మరే ఇతివృత్తం ఆకర్షించలేదు.

రామాయణకావ్య నాయకుడైన శ్రీరాముడు లోకోత్తర నాయకత్వ లక్షణ సమన్వితుడు.

శ్లో॥ యదక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితమ్
గుణైరేతావద్భిర్జగతి పునరన్యో జయతికః
స్వమాత్మానం తత్తద్గుణ గరిమ గంభీర మధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథముప కరిష్యన్తి కవయః॥ [3]

అని అనర్ఘరాఘవకర్త మురారి రఘురాముని గుణ గరిమను ప్రశంసించాడు. దీనిని బట్టి రాముని కావ్య నాయకత్వ గుణోన్నతి ఎట్టిదో తెలుస్తోంది. మాన వాళిని శాసించగల అధికారం, సంస్కరించగల సంస్కారం, మనోవికాసం

కలిగించగల విపులతత్త్వం, నైతికపథంలో నడిపించగల నిర్మలత్వం రామాయణంలోని పాత్రలకున్నంతగా మరే యితర గ్రంథాల్లోని పాత్రలకు లేదంటే అది అతిశయోక్తి కాదు. అందుకే కాళిదాసాది కవులు రామాయణ ప్రాశస్త్యాన్ని పలువిధాల ప్రశంసించారు. అందులో జయదేవుడు ప్రశంసించిన తీరు చమత్కార గర్భితంగా ఉంది.

శ్లో॥ స్వసూక్తీనాం పాత్రం రఘు తిలక మేకం కలయతాం
కవీనాం కోదోషస్సతు గుణ గణానామవ గుణః
యదేతై ర్నిశ్శేషై రపర గుణ లుబ్దై శివ జగ
త్య సావేకశ్చక్రే సతత సుఖ సంవాసన సతిః॥ 4

ఈ జయదేవుని చమత్కార స్తుతి ప్రశంస ఎంతో హృద్యంగా యదార్థాన్ని వ్యక్తం చేస్తోంది.

ఈ విధంగా సుప్రసిద్ధులయిన పూర్వకవులు రామాయణ ప్రాశస్త్యాన్ని ప్రశంసించారు.

ఆధునిక కవులుకూడ రామాయణ ప్రాశస్త్యాన్ని పలువిధాల నుగ్గడించారు. ఆధునిక హిందీ కవుల్లో అగ్రగణ్యులు మైథిలీ శరణ్ గుప్తా. ఆయన తన సాకేత్ గ్రంథంలో

"రామ్ తుమ్‌హారా వృత్ స్వయం హీ కావ్య హై
కోయి కవి బన్‌జాయ్ సహజ్ సంభవ్ హై"5

రామా నీ చరిత్రయే కావ్యం దానిని ఆశ్రయించినవాడు ఎటువంటివాడైన కవి కావడం సహజ పరిణామం. అని ఒక అపూర్వ సత్యాన్ని స్పష్టీకరించారు.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తన శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో—

సీ॥ మఱలనిదేల రామాయణంబన్నచో, నీ ప్రపంచకమెల్ల నెల్లవేళ
దినుచున్న యన్నమే తినుచున్నదిన్నాళ్ళు, తన రుచి బ్రతుకులు తనివిగాన
చేసిన సంసారమే సేయుచున్నది, తనదైనయనుభూతి తనదిగాన
తలచిన రామునే తలచెదనేనును, నా భక్తి రచనలు నావిగాన

గీ॥ కవి ప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశముల యందు తొంబది యైన పాళ్ళు
ప్రాగ్వి పశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవ కథా ధృతిని మించి. 6

అని రామకథా ప్రాశస్త్యాన్ని పేర్కొన్నారు. ఇది సత్య సహితం.

రామాయణం కవులకు రసానుకూలమైనది తాత్వికులకు తత్త్వసుందర మైనది. మానవులకు మార్గదర్శకమయినది. మానవత్వం ఎంతకాలం జీవిస్తుందో రామాయణం అంతకాలం ప్రకాశిస్తుంది.

స్వామి వివేకానంద కాలిఫోర్నియాలోని షేక్స్పియర్ క్లబ్బులో 1900 జనవరి 31వ తేదీనాడు ఉపన్యసస్తూ—

There are two great epics in the Sanskrit Language which are very ancient of course there are hundreds of other epic poems. The sanskrit Language and literature have been continued down to the present day, although for more than two thousand years it has used to be a spoken language. I am now going to speek to you of the most ancient epics called the Ramayana and Maha Bharatha. The embody the manners and customs the state of society, civilisation, etc., of the ancient Indians. The oldest of these epics called Ramayana "The life of Rama; there was some political literature before this-most of Vedas the sacred books of the Hindus are written in short of matter. But this book is held by common consent in India as very beginning of poetry.

The name of poet sage was Valmiki later on a great many poetical stories were fast lened upon that

anicent poet; and subsequently it become very general practice to attribute to his authorship very many Verses that were not his note with standing all these interpolations. It comes down to was a very beautiful arrangement without equal in the literatures of the world"[7]

సంస్కృత భాషలో పురాతనమైన రెండు మహాపురాణాలున్నాయి. వందల కొలది ఇతర కావ్యా లున్నాయి. రెండువేల సంవత్సరాలుగా సంస్కృతభాష వాడుక భాషగా లేకపోయినప్పటికీ సంస్కృతభాష, సాహిత్యం ఈనాటివరకు కొనసాగుతూనే ఉన్నది. నేను యిప్పుడు రామాయణం, మహాభారతం అనేరెండు మహాకావ్యాల గురించి మాట్లాడబోతున్నాను. రామాయణ కావ్యంలో ఆనాటి సమాజంలోని ఆచారవ్యవహారాలు సంస్కృతి మొదలగునవి ప్రతిబింబిస్తున్నాయి. రామాయణకావ్యంకంటే ముందు కొంత పద్య సాహిత్యం ఉన్నది.అప్పటి వేదాలు పురాణాలు అన్నీ ఒక రీతిలో వ్రాయబడినవి. కాని రామాయణ కావ్యం మాత్రం భారతదేశంలో అందరిచేత ఆది కావ్యంగా ప్రశంసింపబడినది.

రామాయణకావ్యం రచించిన కవిపేరు వాల్మీకి. తరువాత కాలంలో చాలా పద్యగాథలు వాల్మీకి మహర్షి రచించినట్లుగా చెప్పబడినవి. ఏది ఏమైనా రామాయణం ఎంతో చక్కగా సమన్వయింపబడినది. (ప్రపంచములోని సాహిత్యాలలో ఏ గ్రంథంకూడా రామాయణకావ్యానికి సాటిరాదు.)

అని రామాయణ ప్రాశస్త్యాన్ని వ్యక్తం చేశారు.ప్రపంచ సాహిత్యపునాడి తెలిసిన స్వామి వివేకానంద మాటలు అక్షరసత్యాలు. ఆయనే మరొక చోట

This is the great ancient epic of India-Rama and Sita are the ideals of the Indian nation"[8]

(రామాయణం ప్రాచీనమైన మహాకావ్యం. రాముడు సీత భారతదేశంలో ఆదర్శప్రాయులు)

అని నిర్వచించారు విశ్వవిఖ్యాత తత్త్వవేత్త, విశ్వ మానవాళికి వెలుగు చూపిన జ్ఞాన జ్యోతి అయిన స్వామి వివేకానంద. ఆయన అభిప్రాయాన్ని అనుశీలిస్తే ప్రపంచ సాహిత్యంలో రామాయణానికి మరో గ్రంథం సాటి కాదని తెలుస్తోంది.

విశ్వ మానవులను మేలుకొలిపిన కవి చంద్రుడు రవీంద్రుడు. ప్రపంచ సాహితీ తత్త్వ వేత్తలలో ఆయన ఒకరు. ఆయన రామాయణం భారతీయులకు ధర్మశాస్త్రం అని మహా కావ్యమని ఉగ్గడించారు.

"రామాయణ కథ నుండి భారత వర్షపు బాలురు వృద్ధులు, వనితలు, పండితులు శిక్షణను మాత్రమే పొందుట కాదు. కేవలము దానిని శిరోధార్య ముగా చేసుకొనుటయేకాక హృదయాంతరాళముల యందును ఉంచుకొనిరి. అది వారికి ధర్మశాస్త్రమే కాదు వారి మహా కావ్యమై యొప్పుచున్నది."[9]

గొప్ప తత్త్వవేత్త, గాంధీజీకి అత్యంత సన్నిహితుడు మేధావి, ప్రఖ్యాత రాజకీయవేత్త భారతదేశంలో ప్రప్రథమంగా లెక్కింపదగిన కొందరిలో ఒకరైన శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచార్యులు రామాయణ ప్రాశస్త్యం గురించి —

"To millions of men, women and children in India the Ramayana is not a mere tale. It has more truth and meaning than the events in one's own life. Just plants grow under the influence of sun light, the people of India grow in mental strength and culture by obsorbing the glowing inspiration Ramayana."[10]

(భారత దేశంలోని లక్షలాది ప్రజానీకానికి రామాయణం ఒక గాథ మాత్రమే కాదు. నిజ జీవితంలో సంభవించే అనేక సంఘటనలకంటే రామా యణంలో సంఘటనలు ఎంతో నిజమైనవి. అర్థవంతమైనవి. సూర్యుని వెలుగులో చెట్లు పెరిగి అభివృద్ధి చెందునట్లుగా భారత ప్రజలు మానసిక శక్తిని, సంస్కృ తిని రామాయణ గ్రంథంలోని అనుభూతుల ద్వారా పెంపొందించుకొంటారు.)

అని సాలంకారికంగా ప్రవచించిన "రాజాజీ, అభిప్రాయంతో ఏమాత్రం సహృదయం కలవారైనా అంగీకరింపక తప్పదు.

పై అభిప్రాయాలను పరిశీలిస్తే వేదాంత తత్వ వేత్తల దృష్టిలో కూడా రామాయణం ప్రశస్తమైనదిగానే తెలుస్తోంది.

రామాయణ దివ్య దీధితులు ఒక భారత భూమికే పరిమితం కాలేదు. విశ్వ వ్యాప్తమైనాయి. రామాయణ ప్రాశస్త్య కాంతిపుంజాని కెందరో పాశ్చాత్య పండిత పుంగవులు ప్రభావితులయినారు.

Winter Nitz అను పాశ్చాత్య పండితుడు రామాయణ ప్రభావాన్ని గూర్చి ఇలా ప్రవచించారు.

"It is a true popular epic like the Maha Bharatha and has become the wealth of the whol nation. Scarcely has any other poem in range of whole literature influe-nced the pob poetry and the life of the people for centuries. If has been kept alive for more than twenty centuries and continues to live. People of all grades and classes, high and low, princes and peasants, mer-chants and artisans, princesses and shepher desses - all are familiar with characters and the story of great epic."11

(రామాయణం కూడ మహాభారతంవలె ప్రసిద్ధిచెందిన పురాణము. అంతే కాకుండా మానవజాతికి ఒక సంపదవంటిది. రామాయణంవలె ప్రజల జీవితాలను ప్రభావితంచేసి స్పందింప చేయగలిగిన గ్రంథం మరేది లేదు. అన్నిరకాల ప్రజలకు రామాయణకథ అందలి పాత్రలు సుపరిచితమైనవి.)

ఈ విధంగా జన జీవితాన్ని ప్రభావితం చేస్తుంది రామాయణం అని వింటర్ నిడ్జ్ అంటే—

షేజల్ అను జర్మన్ ప్రాచ్య విద్యాపండితుడు "Ramayana is the noblest epics" అని ప్రశంసించాడు. ఇంకా సర్ మోనియర్ విలియమ్స్ మొదలయిన విద్వాంసులు రామాయణ ప్రాశస్త్యాన్ని పలువిధాల ప్రశంసించారు.

ఈ అభిప్రాయాలను సమీక్షణం చేస్తే రామాయణానికి భారతీయసాహితీ ప్రపంచంలో అగ్రస్థానం, విశ్వసాహితీ సీమలో ప్రముఖస్థానం కలదని తెలుస్తోంది.

ఆధునికాంధ్ర సాహిత్య విమర్శక పరిశోధకులుకూడా రామాయణ ప్రాశస్త్యాన్ని అనేక విధాలుగ ప్రశంసించారు. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు-

శ్రీ మద్రామాయణ వైభవము సర్వతోముఖమైనది. రసవంతమైన మహాకావ్యముగా, వైదిక ధర్మ సంప్రదాయ సమ్యఙ్ని రూపకమైన ధార్మిక గ్రంథముగా సరససుందర కథోపాఖ్యానమయమైన పురాణ రత్నముగా సంస్కృత సారళ్య సౌష్ఠవ ప్రదర్శకమైన లక్ష్యగ్రంథముగా నుత్తమ మానవ జీవిత నీతి నిరూపమైన నీతి శాస్త్రముగా భారతీయ సంస్కృతి సర్వస్వవిధానముగా దానికి గల ప్రశస్తి యప్రతిమానమైనది.,[12]

అని అప్రతిమాన, రామాయణప్రాశస్త్యాన్ని ప్రవచించినారు.

"వాల్మీకి రామాయణం గీర్వాణ వాఙ్మయంలో ఆదికావ్యం, భారతీయ సంస్కృతికి మణిదర్పణం. సంస్కృత సాహిత్యంలోనే ఆ కావ్యేతివృత్తం వివిధ సాహిత్య ప్రక్రియలో వినూత్న కల్పనా విశేషాలతో విరాడ్రూపం. దాల్చింది. రామాయణం కావ్యంగానే కాదు, తాత్వికదర్శనంగా మహామంత్రంగా ఆధ్యాత్మికౌన్నత్యాన్ని సంతరించు కొన్నది. దేశభాషాసాహిత్యాల్లో అది పండించని పంటలేదు"[13].

అని రామాయణ ప్రాశస్త్యాన్ని సూత్రీకరించారు డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు.

భారతీయసాహిత్య గ్రంథాల్లో అంతర్జాతీయమైన ఖ్యాతి, వ్యాప్తి అధికంగా పొందిన మహాకావ్యం వాల్మీకి రామాయణం. పాశ్చాత్య భాషల్లోకూడా రామాయ

సంస్కారం, కబంధ వధ తరువాత కథాగతిలో శబరి వృత్తాంతం కబంధునిచే ప్రస్తావింపబడుతుంది.

సీతాన్వేషణ చేస్తున్న రామలక్ష్మణులకు ఆతిథ్యమిచ్చి పూజించడం, రామునికి తాత్కాలికంగా సీతా వియోగ దుఃఖాన్ని ఉపశమింప చేయడం వాల్మీకి రామాయణ కథాగతిలో శబరి నిర్వహించే పాత్ర. రామాయణ కావ్యంలో శబరి పాత్ర ప్రాముఖ్యాన్ని పరిశీలిస్తే—

ఒక కవి తన కావ్యంలో ఒక పాత్రను సృజించేటప్పుడు ఆ పాత్ర ద్వారా ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశించే సృష్టిస్తాడు. రసపోషణకు ఉపకరించేదిగానో, కావ్య శరీరానికి అంగమై పరిపుష్టినొందేందుకో, ఒక ఆభరణమై ప్రకాశించేందుకో, సందేశానికి సంకేతంగానో, ఒక ధ్వనిని వినిపించడానికో, ఒక అనుభూతికి ప్రతీకగానో ఒక ధర్మానికి మార్గదర్శకంగానో, తాను అన్వేషించి దర్శించిన సత్యానికి అక్షర రూపం కల్గించడానికో, హృదయాంబుధిని మథించి సాధించిన సుధను సహృదయుల ముందుంచడానికో తన కావ్యంలో పాత్ర సృష్టి కావిస్తాడు కవి.

వాల్మీకి రామాయణంలో శబరిపాత్ర ప్రాముఖ్యం అంతగా లేకపోయినా అందించే సందేశం మాత్రం అనల్పం. అలతి అలతి పాత్రల ద్వారా అనల్ప సందేశాలను అందించే ప్రతిభా భాసురుడు వాల్మీకి అనడానికి శబరిపాత్ర చక్కని తార్కాణం.

వాల్మీకి చెప్పిన శబరి పాత్ర కథ ఇలా ఉంది.

రామలక్ష్మణులు కబంధుణ్ణి వధించి అతని శరీరాన్ని దహిస్తారు. అతడు పొగలేని నిప్పులా పైకిలేచి, నిర్మల పీతాంబరాలు ధరించి అంబరవీధిలో హంస యుక్త విమానంలో దశదిశలూ తన తేజస్సుతో వెలిగిస్తూ సీతను పొందేమార్గం రామునికి తెలియచేస్తూ సుగ్రీవునితో స్నేహం చెయ్యమని చెబుతాడు. సుగ్రీవుని ఉనికికి దారి తెలియచేస్తూ మతంగ మహాముని మహత్త్వాన్ని వివరిస్తూ మతంగాశ్రమ వర్ణన చేసే సందర్భంలో శబరిని గురించి ఇలా పేర్కొంటాడు.

శ్లో॥ తేషా మద్యాపి తత్రైవ దృశ్యతే పరిచారిణీ
శ్రమణీ శబరి నామ కాకుత్స్థ చిరజీవినీ
త్వాంతు ధర్మేస్థితా నిత్యం సర్వభూత నమస్కృతమ్
దృష్ట్వాదేవోపమంరామ స్వర్గలోక గమిష్యతి॥ 19

అంటూ కబంధుడు రామునికి శబరిని గురించి తెలియచేస్తాడు. మహర్షులకు పరిచారిణి అయిన శబరి చిరంజీవిగా పంపా తీరంలో గల ఆశ్రమంలో ఉంది. ఆమె నిన్ను చూసి స్వర్గానికి వెడుతుంది; అని చెప్పడంలో శబరి సన్యాసిని అయి గురుశుశ్రూష చేసిందనీ, అయినా ఆమెకు ముక్తి కలుగలేదనీ, శ్రీరామ దర్శనానంతరమే ఆమెకు మోక్షప్రాప్తి కలుగుతుందనీ శ్రీరామ దర్శనార్థమే ఆమె జీవించి ఉందనీ వ్యజింపచేసాడు వాల్మీకి. కావ్య నాయకుడయిన శ్రీరాముడు ముక్తి ప్రదాత అనే భావం కూడ ధ్వనింపచేసాడు.

అటు తరువాత శబరి వృత్తాంతం అరణ్యకాండ 74 వ సర్గలో 35 శ్లోకాలలో చెప్పబడి ఉంది.

రామలక్ష్మణులు కబంధుడు చెప్పిన గుర్తులను అనుసరిస్తూ పడమటి దిక్కుగా వెళ్ళి అక్కడగల పర్వతంమీద ఆ రాత్రి విశ్రమిస్తారు. ప్రాతః కాలాననే పంపాసరస్సుయొక్క పడమటి తీరాన రమ్యమైన శబరి ఆశ్రమాన్ని చూస్తారు. మనోహరమైన ఆ ఆశ్రమాన్ని వీక్షిస్తూ శబరి సమీపానికి వెళ్ళారు. సిద్ధమైన యోగాభ్యాసంగల శబరి వారిని చూసి అంజలి ఘటించి, పాదాభి వందనం ఆచరించి శాస్త్రోక్త విధిని వారికి పాద్యం అచమనీయం, ఆతిథ్యం మొదలయిన సర్వవిధ ఉపచారాలూ చేస్తుంది.

తరువాత రాముడు శబరిని ఇలా ప్రశ్నించాడు. ఉగ్రమైన తపస్సుకల శబరీ "నీ తపస్సుకు విఘ్నాలుగా ఉండే కామాదులను జయించావా ! నీ తపస్సు వృద్ధి అగుతోందా ! తపస్సే ధనంగాగల శబరీ కోపాన్ని జయించావా? ఆహారాన్ని నిగ్రహించవా ? నీ వ్రతాలన్నీ ఫలించాయా ? నీ మనస్సు సుఖంగా ఉందా ! చారుభాషిణీ నీ గురుపూజ సఫలమైందా ? అని రాముడామెను ప్రశ్నిస్తాడు. తపస్విని, తపస్సిద్ధి కలిగినదీ, సిద్ధులకు సమ్మతమయిన

ణాను వాదాలు, అనువాదాలతో పాటు విమర్శగ్రంథాలు, వ్యాసాలు ఎన్నో వెలువడ్డాయి. ఇంకా వెలువడుతున్నాయి. నాస్తిక జీవిత ప్రాధాన్యమున్న రష్యావంటి కమ్యూనిస్టు దేశాల్లో కూడా రామాయణానికి ఆదరణ ఉండడం రామాయణ కావ్య విశ్వ జనీనతకు ఒక ప్రబల నిదర్శనం.[14]

అని డా॥ జి. యన్. రెడ్డిగారు రామాయణ విశ్వజనీనతనూ, సార్వకాలికతనూ గురించి పేర్కొన్నారు.

పై అభిప్రాయాలను అన్నిటిని సమాలోచిస్తే రామాయణ కావ్యం హైందవ సంస్కృతీ సరోజానికి సూర్యునిలాంటిదని రసమయ కావ్యమని, ధర్మ ప్రతిష్ఠాపనకు తాత్విక ప్రబోధానికి మూలస్తంభమని, విశ్వశ్రేయ మార్గదర్శకమైనదని రామాయణ ప్రాశస్త్యం స్పష్టమౌతోంది.

రామాయణం కవులకు కల్పతరువు. విమర్శకులకు కళల కాణాచి. తాత్వికులకు పరమార్థదీపిక, భక్తులకు కామధేనువు. మాన్యులకు మనోజ్ఞరస ప్రవాహము. సామాన్యులకు సకలార్థసంధాయిని.

తేజోప్రసారమున సూర్యునకు సాటి సూర్యుడే. ఉన్నతత్త్వమున హిమగిరికి సరి హిమగిరియే. పవిత్రతకు గంగకు దీటు గంగయే అన్నట్లు ప్రశస్త గ్రంథాలలో రామాయణానికి దీటు రామాయణమే అని చెప్పవచ్చు.

రామాయణ సుధాసింధువులో ప్రతిబింబువూ ప్రమోదాత్మకమే, ప్రబోధాత్మకమే, ప్రయోజనదాయకమే అనవచ్చు.

వాల్మీకి రామాయణంలో ప్రతి పాత్ర ఒక ధర్మానికో లేక సత్యానికో లేదా ఒక భక్తితత్త్వానికో ప్రతీకాత్మకంగా మలచబడింది. పరిశీలనాలోచనాలతో పరికిస్తే రామాయణంలోని ప్రతి చిన్న పాత్రలో కూడ ఒక గొప్ప తత్త్వం దర్శితమౌతుంది.

# వాల్మీకి రామాయణ కథాగతిలో శబరి

వాల్మీకి రామకథను ఆరుకాండలుగా విభజించి రచించాడు.

1. బాలకాండ 2. అయోధ్యాకాండ 3. అరణ్యకాండ 4. కిష్కింధాకాండ 5. సుందరకాండ 6. యుద్ధకాండ.

శ్లో॥ చతుర్వింశత్ సహస్రాణి శ్లోకానా ముక్తవాన్ ఋషిః
తథా సర్గశతాన్ పంచషటాఖండాని తథోత్తరమ్॥15

అనుశ్లోకంవల్ల రామాయణం యుద్ధకాండవరకు ఆరుకాండలుగాను, ఐదు వందలసర్గలుగాను, ఇరువది నాలుగు వేల శ్లోకాలు కలదిగాను వాల్మీకి రచించి నట్లు తెలుస్తోంది. తదోత్తరమ్ అనుట చేత ఆ తరువాత ఉత్తర కాండను కూడా రచించినట్లు ఊహించుట కవకాశం కలుగుతోంది.

వాల్మీకి రామాయణంలో మంత్రశ్రేష్ఠమైన గాయత్రీ మంత్రంలోని '24' అక్షరాలను ప్రతి వేయి శ్లోకాలలో ఒక్కొక్క అక్షరాన్ని నిక్షిప్తీకరించినట్లూ, ప్రతి వేయవ శ్లోకమూ గాయత్రీ మంత్రాక్షరంతో ఆరంభమవుతున్నట్లు పలువురు పేర్కొన్నారు.

కాని మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు మాత్రం రామాయణము ఆరు కాండలలో 537 సర్గలున్నట్లు సుమారు 20,700 శ్లోకాలున్నట్లు అధికపాఠ శ్లోకాలు సుమారు 500 ఉన్నట్లు పేర్కొన్నారు. ఈ సంఖ్య వాల్మీకిరామాయణా నికి కల అనేక ప్రతులలో యే ప్రతి లెక్కించినా ఒకటిరెండు వందల శ్లోకాల తేడాతో సరిపడతాయనీ రామాయణ సర్గలలో శ్లోకాల సంఖ్యలో యథార్థం యిదని నిర్ధారించారు.

వాల్మీకి రామాయణంలో శబరి ప్రస్తావన మొట్ట మొదట బాలకాండలో ప్రథమ సర్గశ్లోకం నెం॥ 56 లో కనిపిస్తోంది. ఈ సర్గలో నారదుడు వాల్మీకికి

రామకథ సంగ్రహంగా తెలియచేస్తాడు. ఈ సంగ్రహ రామయణంలో కబంధుడు రామలక్ష్మణుల వల్ల శాప విముక్తి పొంది స్వర్గానికి వెళ్ళుతూ-

శ్లో॥ సచాస్య కథయా మాస శబరీం ధర్మచారిణీమ్
శ్రమణీం ధర్మనిపుణా మభిగచ్ఛేతి రాఘవ॥ 17

అని శ్రీ రామచంద్రునికి శబరిని గురించి తెలియచేస్తాడు కబంధుడు. ఆ తర్వాత-

శ్లో॥ సోఽభ్యగచ్ఛన్మహా తేజాః శబరీం శత్రుసూదనః
శబర్యా పూజితః సమ్యగ్రామో దశరథాత్మజః॥ 18

ఈ రెండు శ్లోకాలలోనే శబరిని సంగ్రహ రామాయణంలో వాల్మీకి మొట్ట మొదట ప్రస్తావించడం జరిగింది.

ఇక్కడ శబరిని ఉద్దేశించి వాడిన విశేషాణాలు మూడు. 1. ధర్మచారిణీ 2. శ్రమణీ 3. ధర్మనిపుణ. అని.

'ధర్మచారిణీమ్' అనగా ధర్మాన్ని ఆచరించే స్వభావం కలది అని ఆమె స్వభావాన్ని వాల్మీకి పేర్కొన్నాడు. ఎటువంటి ధర్మం అని సందేహం రావచ్చు కనుక వెంటనే శ్రమణీమ్, అన్నాడు. అనగా సన్యాసిని అని అర్థం. దీనిని బట్టి సన్యాసినీ ధర్మాన్ని ఆచరించేదే ఆమె స్వభావంగా భావించాలి. కాని ధర్మ నిపుణా అను విశేషణాన్ని కూడ వాడడం చేత ధర్మరహస్యాలను చక్కగా తెలిసిన వ్యక్తి ఆమె అని తెలియ చేయడం వాల్మీకి ఉద్దేశమని తెలుస్తోంది.

ఇటువంటి శబరి దగ్గరికి మహా తేజశ్శాలి శత్రు నాశకుడు అయిన రాముడు వెళ్ళెను. ఆమె దశరథ తనయుడయిన రాముని చక్కగా పూజించెను.

కథాగతిలో శబరి వృత్తాంతం కనిపించే సందర్భం ఇలా ఉంది—

**బాలకాండలో కథ** - వాల్మీకి ఋషిని నారదమహర్షి ఈ భూమండలంలో సంపూర్ణ మానవత్వ లక్షణాలు కలిగిన మానవుడెవడు? అని ప్రశ్నించ

దంతో ఆరంభం అవుతుంది. దశరథుడు సంతాన సౌభాగ్యంకోసం పుత్రకామేష్టి చేయడం, పుత్రజననం, బాల్యం, విశ్వామిత్ర ఆగమనం రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట వెళ్ళడం, తాటక మర్దనం శస్త్రాస్త్ర ఆయుధ విద్యాపరిగ్రహణం, యాగ సంరక్షణ, అహల్యా శాపవిమోచనం, మిథిలా నగర ప్రవేశం, శివ ధనుర్భంగం, సీతారామ కళ్యాణం, పరుశురామ గర్వభంగం, అయోధ్యా నగర ప్రవేశం, సీతారాములు, అయోధ్యలో లక్ష్మీ విష్ణువుల్లా శోభిల్లడంతో బాలకాండ కథ పూర్తి అవుతుంది.

**అయోధ్యాకాండ** - భరతుడు తన మేనమామ ఇంటికి వెళ్ళుతూ శత్రుఘ్నుణ్ణి తనతో తీసుకుపోవటంతో మొదలవుతుంది. ఇందులో శ్రీరామగుణవర్ణన, పట్టాభిషేక నిర్ధారణ, మంథర మంతనం, కైకవరాలు కోరడం, శ్రీరామ పట్టాభిషేక భంగం, దశరథుని దుఃఖం, పితృవాక్య పరిపాలనకోసం రాముడడవికేగ సిద్ధమవడం, తల్లి కౌసల్యయొక్క దుఃఖాశీస్సులు అందుకొనడం, సీతా లక్ష్మణ సమేతుడై రాముడు వనానికి వెళ్ళే సమయాన దశరథుడు మూర్ఛపోవడం, సుమంతుడు కైకను నిందించడం, పౌరులు రాముణ్ణి అనుసరించడం, అయోధ్యా నగర క్షోభ, కౌసల్యా దశరథుల విలాపం, రాముడు సుమంతునితో రథమెక్కి తమసానదీ తీరం చేరగ పౌరులు అయోధ్యకు మరలడం కోసం రహస్యంగా వనగమనం చేసి గంగాతటాన గుహుని కలుసుకోవడం, గుహునికి లక్ష్మణునికి జరిగిన సంవాదంతో అయోధ్యాకాండ పూర్తి అవుతుంది.

**అరణ్యకాండ** - శ్రీరాముడు సీతాలక్ష్మణులతో కలసి దండకారణ్యంచేరడంతో మొదలవుతుంది. ఋష్యాశ్రమ సందర్శనం, విరాధ వధ, శరబంగాశ్రమంలో మునులు రాముని శరణు వేడడం, రాక్షస సంహారం చేస్తానని రాముడు ప్రతిజ్ఞ చేయడం, సుతీక్షుని ఆశ్రమ సందర్శనం, అతని అనుజ్ఞతో మున్యాశ్రమాలను సంచరించడం రాముడు మరలా ఒకసారి మునుల సమక్షంలో రాక్షసుల నిశ్శేషంగా సంహరిస్తానని ప్రతిజ్ఞ చేయడం, సీత భయపడి రాక్షసులతో తగవు వద్దని చెప్పడం, ఆర్తత్రాణ పరాయణత్వాది రాజధర్మాలను సీతకు తెలపడం జటాయును సందర్శించడం, పంచవటిలో నివాసం, శూర్పణఖ రాక, ఖరదూషణాదుల సంహారం, శూర్పణఖ రావణాసురుని దగ్గరికి వెళ్ళి సీతారామ లక్ష్మణుల గురించి చెప్పడం, సీతాపహరణం, రామలక్ష్మణుల దుఃఖం, జటాయుదహన

వర్తనం కలది, వృద్ధురాలు అయిన శబరి ఇలా సమాధానం చెప్పింది. రామా నీ దర్శనం వలన నా తపస్సు ఇపుడే పరిపక్వమయింది. ఇపుడే ఫలించింది. పురుష శ్రేష్ఠుడైన ఓ రామా ! సాక్షాద్విష్ణువగు నిన్ను నేను పూజించినందువల్లా నా జన్మ సఫలమైంది. నీ నిర్హేతుక కటాక్షంవల్ల పరిశుద్ధురాలను అయినాను. ఓ శత్రు సంహారకా, ఆచార్యానుగ్రహంతో కూడిన నీయనుగ్రహంచే పునరావృత్తిలేని పరమపదాన్ని పొందుతాను. అనిచెప్పి, రామా! నీవు చిత్రకూటంలో ఉండగా నేను శుశ్రూషచేస్తూ ఉండిన ఆచార్యులు దివ్యవిమానం ఎక్కి దివ్యలోకానికి పోయారు. త్రికాలవేదులయినవారు భగవత్ ప్రాప్తికి ఉపాయంగా ఉండు యోగసిద్ధి లేకపోయిననూ ఆచార్యుని అనుగ్రహం చేత కలిగే భగవదనుగ్రహంవల్ల మోక్షాన్ని పొందవచ్చు అని తెలిసినవారైన ఆ మహర్షులు ఓ శబరీ ! అత్యంత పరిశుద్ధంగా ఉండే ఈ ఆశ్రమానికి శ్రీరాముడు వస్తాడు. లక్ష్మణునితో అతిథిగావచ్చే శ్రీరామునికి నీవు ఆతిథ్యం ఇచ్చి సత్కరించు అతని దర్శనమాత్రం చేతనే ఆకారరహితమయిందీ, శ్రేష్ఠ మయిందీ అయిన పరమపదం నీవు పొందుతావు. అని నాకు చెప్పారు.

ఓ పురుషోత్తమా! నేను పంపాసరస్సుతీరంలో ఉండేవనంలోగల ఫలాలను నీకుగాను సంపాదించి ఉంచాను - అంటుంది శబరి. ధర్మాత్ముడైన రాముడు సదా జ్ఞానంచేత బహిష్కృతంకాని హృదయంగల ఆమెనుచూసి 'శబరీ, మేముకబంధునివలన మతంగాశ్రమమహత్వాన్నీ, మతంగ మహర్షి మహిమను విన్నాము. నీవుచూపితే ఆశ్రమసీమను చూడకోరుచున్నాము, అనగా శబరివారికి మతంగాశ్రమాన్ని చూపెట్టింది.గురువు గొప్పతనాన్ని ప్రతిబింబించే గుర్తులను చూపింది.

మతంగ మహర్షి ప్రభావంవల్ల అక్కడికి వచ్చి చేరిఉన్న సప్తసాగరాలనూ, దిక్కులకు వెలుగులు వెదజల్లే పూజావేదికనూ పూజకోసం ఉపయోగించిన పూలు వాడనివైనాన్నీ, తడి ఆరని నారవస్త్రాలను వారికి చూపెట్టి ఆచార్యుని ఔన్నత్యాన్ని వర్ణించి చెప్పింది. ఇంక నేను నాగురువుల సన్నిధికి పోగోరుచున్నాను అంది.

లక్ష్మణసహితుడైన రాముడు ధర్మయుక్తాలయిన శబరి మాటలను విన్నాడు. ఆశ్చర్యంగా ఉందన్నాడు. ఎంతో ఆనందించాడు. సంశ్రితవ్రత

అయిన శబరిని చూసి నీవు నన్ను భక్తితో పూజించావు. నీవు కోరిన లోకాలకు సుఖంగా వెళ్ళు అన్నాడు. రాముడు అట్లనగానే తన జీర్ణ దేహాన్ని రామానుజ్ఞతో అగ్నిలో హోమం చేసింది. దివ్యమయిన ఆభరణాలు, పూలహారాలు ధరించి మంచిగంధాన్ని పూసుకొని, దివ్యాంబరాలు ధరించి, మెరుపులా ఆ ప్రాంతాన్ని ప్రకాశింపచేస్తూ అందమైన రూపం కలిగిందై మహర్షులు యేలోకానికి పోయారో ఆ పుణ్యలోకాలకు వెళ్ళింది. ఇదీ వాల్మీకి రామాయణంలో కనిపించే శబరి వృత్తాంతం.

కథాగతిలో శబరిపాత్ర ప్రాముఖ్యాన్ని అనుశీలిస్తే ఇలా ఉంది.

రామాయణ కావ్యంలో నాయకుడు రాముడు. అతడు సీతావియోగ దుఃఖం అనుభవిస్తున్న సందర్భంలో నాయికకోసం అన్వేషించే సమయంలో శబరిపాత్రను ప్రవేశపెట్టాడు వాల్మీకి. కావ్యనాయకుడైన రామునికి శబరి ఆతిథ్యం ఇచ్చినందువల్ల మతంగాశ్రమ సందర్శనంవల్ల సీతావియోగదుఃఖం తాత్కాలికంగా ఉపశమనాన్ని కలిగిస్తుంది. ఇది కావ్యనాయకుని కార్య సాధనలో ఉపపాత్ర అయిన శబరి ఉపకరించినతీరు ఇక్కడ "ప్రకరి" అనే అర్థ ప్రకృతికి శబరి వత్తాంతాన్ని అన్వయించవచ్చు.

"ప్రకరీ" అర్థ ప్రకృతులలో ఒకటి. అర్థ ప్రకృతులను దశరూపక కర్త—

శ్లో॥ బీజ బిందు పతాకాఖ్య ప్రకరీ కార్యలక్షణాః
అర్థ ప్రకృతయః పంచఏతాః పరికీర్తితాః" 20

అని పేర్కొన్నాడు. కథను విస్తరించే దృష్టిలో ఈ అర్థ ప్రకృతులు కావ్యంలో ప్రయోగింపబడుతాయి. పంచవిధ అర్థ ప్రకృతులలో ప్రకరి నాల్గవది.

**అర్థ ప్రకృతుల లక్షణాలు**

1. బీజము - కథకు మూల భూతమైన ఘటనను సూచించడం.

2. బిందువు - బీజరూపమైన ఘటనను పెంచడం.

3. పతాక - కథ మధ్యలో వచ్చే ఉపకథ.

4. ప్రకరి - ప్రాసంగికంగా వచ్చిన చిన్నకథ.

5. కార్యము - కథా పరిణామం అనగా ఫలం.

వాల్మీకి రామాయణంలో శబరి వృత్తాంతం ప్రాసంగికంగా వచ్చిన చిన్న కథ. కబంధుని ప్రసంగంలో శబరి వృత్తాంతం ప్రస్తావింపబడుతుంది. రాముడు శబరి ఆశ్రమాన్ని దర్శించడం శబరి ఆతిథ్యం ఇవ్వడం శబరికి మోక్షప్రాప్తి కలిగించడం అనే విషయాన్ని ఉపకథగా స్వీకరించి పతాక అని చెప్పడానికి వీలులేదు. ఇది ప్రాసంగికంగా వచ్చిన చిన్న కథ మాత్రమే. కనుక దీనిని ప్రకరి అనే పేర్కొవాలి.

అవస్థాపంచకంలో శబరి వృత్తాంతం నియతాప్తి అనే కావ్య లక్షణానికి లక్ష్యంగా ఉంది.

అవస్థా పంచకం—

శ్లో॥ అవస్థాః పంచకార్యస్య ప్రారబ్దస్య ఫలార్థిభిః,
ఆరంభ, యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమాః.21

నాయకుని కార్య సాధనలో వస్తువునందు ఐదు స్థితులుంటాయి. వీటికే అవస్థా పంచకం అనిపేరు.

1. ఆరంభము : ముఖ్య కార్యసాధన నాయకాదులకు కలిగే ఔత్సుక్యం.

2. యత్నము : ఆటంకాలు కలుగుతూంటే వాటిని నివారించుకొంటూ కార్యసాధనకు నాయకుడు చేసే యత్నం.

3. ప్రాప్త్యాశ : సాధనోపాయాలు ఆటంకాలు నివారింపబడి ఫలప్రాప్తి సంభవిస్తుందన్న ఆశ కలుగుతుంది.

4. నియతాప్తి : ఆంటకాలు నివారింపబడి ఫలప్రాప్తి నిశ్చయంగా కలుగుతుందనే విశ్వాసం.

5. ఫలాగమము : ఉద్దేశించిన ఫలం సమగ్రంగా ప్రాప్తించడం.

ఈ ఐదు అవస్థా భేదాలలో నియతాప్తి అనే అవస్థా భేదానికి శబరి పాత్ర ఉదాహరణంగా ఉంది.

రాముడు సీతాన్వేషణలో కలిగిన ఆటంకాలను తొలగించుకొని అనగా కబంధ బంధం నుండి విముక్తుడై అతనికి ముక్తి కలగచేసి అతని ద్వారా సుగ్రీవుడు తన కార్య సాధనలో సహాయ భూతుడు కాగలడని తెలిసికొని అతని వద్దకు వెళ్ళే మార్గంలో శబరి ఆశ్రమాన్ని చూస్తాడు. మనఃక్లేశోపశమనం పొందుతాడు. కనుక ఇక్కడ నాయకునికి ఫలప్రాప్తి నిశ్చయంగా కలుగుతుందనే అంశం సూచ్యార్థ సూచకంగా ధ్వనింపచేయబడింది. అందువల్ల నియతాప్తి అనే అవస్థా భేదానికి దీనిని ఉదహరించవచ్చు.

సంధి పంచకంలో శబరి వృత్తాంతం అవమర్శ సంధికి ఉదాహరణంగా చెప్పవచ్చు.

ఐదు అర్థ ప్రకృతులూ, ఐదు అవస్థలూ క్రమంగా చేరితే వస్తువులో ముఖ, ప్రతిముఖ, గర్భ, అవమర్శ, ఉపసంహృతు (నిర్వహణ సంధి) లనే పంచ సంధులు ఏర్పడుతాయి.

1. ముఖ సంధి : కథ బీజ రూపంలో ఉంటుంది. నాయకుడు తన కార్యాన్ని ఆరంభిస్తాడు.
2. ప్రతిముఖ సంధి : దీనిలో కథ కొంత పెరుగుతుంది. నాయకుడు కార్య సాధనకై యత్నిస్తాడు.
3. గర్భ సంధి : దీనిలో కార్య ఫలం ప్రాప్తించే సూచన కనిపిస్తుంది.
4. అవమర్శ సంధి : ఇందులో కథ గర్భ సంధికంటే కొంత ముందుకు సాగుతుంది. నాయకుడు కోప వ్యసన, విలోభనాదుల నుండి కొంత తేరుకొని నిలబడతాడు.
5. నిర్వహణ సంధి : దీనిలో ఇంతవరకు నానా ముఖాలుగ ఉన్న కార్యమంతా ఏక ముఖమై ముగుస్తుంది. నాయకుడు ఉద్దిష్ట కార్య ఫలాన్ని పొందుతాడు.

పై పంచసంధులలో శబరి వృత్తాంతం అవమర్శ సంధికి లక్ష్యంగా ఉంది. శబరి ఆశ్రమంలో కావ్య నాయకుడైన రాముడు సీతా దుఃఖోప శమనాన్ని పొందుతాడు. కొంత శాంత చిత్తుడవుతాడు. కథ కొంత ముందుకు సాగుతుంది. కనుక కథాగతిలో శబరి పాత్ర అవమర్శ సంధికి ఉదాహరణముగా పేర్కొనవచ్చు.

సీతను రావణాసురుడు అపహరించిన తరువాత దుఃఖ మగ్న మానసంతో దగ్ధ హృదయం కలవాడై విపినంలో విలపిస్తూ సంచరిస్తున్న సమయాన శబరి ఆశ్రమం చేరిన రామునికి ప్రథమంగా కొంత స్వస్థత చేకూరింది. ప్రశాంతత కలిగింది. ఇది నాయకునికి ఫల ప్రాప్తి కలుగుతుంది అనడానికీ ఇతివృత్తం సుఖాంతం శుభాంతం కాగలదనడానికి సూచ్యార్థ సూచ్యంగా, భవిష్యర్థ సూచకంగా శబరి ఇతివృత్తం ఉందని కూడ చెప్పవచ్చు. కథాగతిలో శబరి పాత్ర సాధించిన ప్రయోజనాలలో ఇది కూడ ఒక్కటని పేర్కొవచ్చు.

వాల్మీకి రామాయణ కథాగతిలో శబరి పాత్ర స్థానాన్ని కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు ఇలా వ్యక్తీకరించారు.

"Sabari remains from the stand point of constraction of the story simply as a relief to Rama when he was so dispondent."[22]

(రామాయణ కథానిర్మాణంలో శబరి వృత్తాంతం శ్రీరాముడు నిరాశోప హతుడైనప్పుడు అతనికి కొంత ఓదార్పును కల్గించడానికి ఉపకరించింది.)

అనిన విశ్వనాథ వారి మాటలు అర్థవంతంగా ఉన్నాయి.

ఈ ఘట్టంలో శ్రీరాముని అప్రాకృత పురుషత్వం చక్కగా వ్యంగీకరింప బడింది అని ఆచార్య దివాకర్ల వారు పేర్కొన్నారు.

"శబరి స్త్రీయయ్యును బ్రహ్మచర్యము నవలంబించి యోగ సాధన కావించి, గురు కృపాబలంచే బరమపురుషుడైన శ్రీరాముని దర్శించి మోక్షసామ్రాజ్యమును జూరలాడెను. ఆదికవి యీ ఘట్టమున శ్రీరాముని యప్రాకృత పురుషత్వమును చక్కగా వ్యంగ్యము చేసియున్నాడు "[23]

రామాయణ కావ్య నాయకుడైన శ్రీరాముని సకల సద్గుణ సంపన్నునిగా, ఆదర్శమానవునిగా, ధర్మ ప్రతిష్ఠాపన ధర్మ రక్షణ ధర్మాచరణ దీక్షాపర తంత్రునిగా శరణాగత వత్సలునిగా, పరాక్రమంలో విష్ణు సమానునిగా, చంద్రునివలే నాహ్లాదకరమగు దర్శనం ఇచ్చే వానిగా, కోపం వస్తే ప్రళయాగ్ని సమానునిగా సహిష్ణుతలో సర్వంసహా సమునిగా చిత్రించుట వాల్మీకి యొక్క ప్రధానోద్దేశం.

ఈ గుణాలకు అనుగుణంగానే సర్వత్ర శ్రీరాముని వర్తనాదులను అనువర్తింప చేసాడు వాల్మీకి. కానీ శ్రీరాముడు భగవంతుడు అని ధ్వని గర్భితంగా చెప్పిన సందర్భాలు కూడా ఉన్నాయి.

అధ్యాత్మ రామాయణాదులు శ్రీరాముని భగవంతునిగా వాచ్యంగా పేర్కొన్నాయి. కాని వాల్మీకి వాచ్యంగా శ్రీరాముని భగవంతుడని పేర్కొన్న సందర్భాలు చాలా తక్కువ. అహల్య, కబంధ, శబరి మొదలయిన వారికి దివ్యపద ప్రాప్తి కలగచేసిన సందర్భాలలో మాత్రమే వాల్మీకి శ్రీరాముణ్ణి అప్రాకృత పురుషునిగా ధ్వనింప చేశాడు.

శబరి స్త్రీ, అందులో సేవాభావంకలిగి నట్టిది. అయినా నియమమైన వ్రతాచరణ,ధర్మాచరణాదులు కలిగినట్టిది. తనదర్శనార్థం నిరీక్షిస్తున్నట్టిది.తననే శరణాగతి పొందినట్టిది. అటువంటి శబరి ఆతిథ్యం అతిప్రేమతో స్వీకరించి ఆమెకు దివ్యత్వం ప్రసాదించడం వలన కథానాయకుడయిన శ్రీ రాముని శరణాగత వత్సలత గుణాన్ని ఉన్నతం చేయడం శబరిపాత్ర వలన వాల్మీకి సాధించిన పరమ ప్రయోజనాలలో ఒకటిగా పేర్కొనవచ్చు.

ఈ విధంగా వాల్మీకి రామాయణ కథా గతిలో శబరి అర్థ ప్రకృతులలో ప్రకరిగానిలచి, అవస్థా పంచకంలో నియతాప్తికి, సంధి పంచకంలో అవమర్శ సంధికి పోషకంగా నిలచింది.

శ్రీరాముని అప్రాకృతపురుషత్వాన్ని వ్యంజింప చేయడానికి ఒకసాధనంగా శబరిపాత్రను వాల్మీకి కల్పించాడని చెప్పవచ్చు.

## శబరి భక్తి

శబరి అనగా చెంచెత, శబరస్త్రీ, రామభక్తురాలైన యొక కోయది, అని నైఘంటికార్థం.

శబరుడు అనగా ఆకులు కట్టుకొని అడవియందు తిరిగెడు బోయవాడు; శివుడు, అనే నిఘంటువులలోని అర్థాలను పరికిస్తే శబరి అనేది కులవాచకంగా తెలుస్తోంది. అనగా శబరి బోయ కులానికి చెందిన స్త్రీ అనవచ్చు. కాని వాల్మీకి రామాయణంలో శబరి అను శబ్దం నామవాచకంగా ప్రయోగింప బడినట్లు కనిపిస్తుంది.

శ్లో॥ తేషా మద్యాపి తత్రైవ దృశ్యతే పరిచారిణీ,
శ్రమణీ శబరీ నామ కాకుత్స్థ చిరజీవినీ॥24

అను శ్లోకంలో శబరి అనేది ఆమె పేరుగానే పేర్కొబడింది. వాల్మీకి రామాయణంలో శ్రమణీ సంశ్రితవ్రతా చారుభాషిణీ, తపోధనే, వృద్ధా, పరిచారిణీ మొదలయిన విశేషణాలు వాడబడి ఉన్నాయి. ఇవన్నీ శబరి స్వరూప స్వభావాలను తెలపేవేకానీ ఆమె కులాన్ని తెలిపేవి కావు.

అధ్యాత్మరామాయణంలో మాత్రం ఒక శ్లోకంలో శబరి శ్రీరామునితో నేను హీన జాతి సముద్భవను అని అంటుంది.

శ్లో॥ తవ సందర్శనం రామ గురూణామపి మే నహి,
యోన్మూఢా ప్రమేయాత్మన్ హీనజాతి సముద్భవా॥25

నా గురువులయిన మతంగ మహర్షులకు కూడ లభించని నీ దర్శనం స్త్రీ మాత్రురాలను, మూఢ దర్శనురాలను, హీనజాతిలో పుట్టిన దానను అయిన నాకు ఈ భాగ్యం లభించింది." అని అంటుంది శబరి. లోకంలో శబరి బోయజాతిస్త్రీ గానూ, శబరి అనేది ఆమెపేరు గాను స్థిరపడిపోయింది. శబరి కులం ఏదైనా ఆమె భక్తి మాత్రం అపారం.

రామాయణ కర్తలుగానీ వ్యాఖ్యాతలుగానీ శబరికి క్రొత్త నిర్వచనం చెప్పినవారు అరుదు. డా॥ వేదులసూర్యనారాయణ గారు మాత్రం శబరికి సరి క్రొత్తనిర్వచనాన్ని చూపారు.

"శబరిని కిరాతస్త్రీనిగా చెప్పడానికి వీల్లేదు. శవరిఅనేదే శబరిగా మారిం దనాలి. సంస్కృతంలోను, వంగభాషలో కూడ వ, బ, యోరభేదః' అనివుంది. 'వ,కార 'బ' కారలకు భేదం లేదు. అని దాని అర్థం. ఈ విధంగా 'శబరి'ని 'శవరి' అనిచెప్పడం తప్పుకాదు. 'శవరి'అంటే శేతే వరే ఇతి శవరీ,వరే=శ్రేష్ఠుని యందు అంటే సర్వశ్రేష్ఠుడైన భగవంతునియందు శేతే = శయనించి ఉండేది అని "శవరీ" పదానికి (వ్యుత్పత్త్యర్థం చెప్తే) భగవంతుని గూర్చియుండే నిరంతర మానసిక వృత్తి, శవరీ, పదానికి అర్థంగా చెప్పవచ్చును. నిత్యము భగవంతుని భావించే మనో వృత్తి శవరీ వృత్తి అన్నమాట. శబరి మతంగముని శిష్యురాలు. మతంగచ్ఛతి, ప్రాప్నోతి ఇతిమతంగః, మతమును అంటె అందరకు ఇష్టమైన సనాతన ధర్మమును 'గ' అంటే పొందియుండునది అన్నది మతంగ పదానికి అర్థం. ఈ విధంగా మతమును ఆశ్రయించి ఉండే శవరి అంటే భగవ ద్భావన సనాతన ధర్మమును ఆశ్రయించినప్పుడే వృద్ధి పొందుతుంది అన్నది. మతంగ మహర్షి సేవతో శవరి తరించింది అన్నదానికి అంతరార్థం. ఈవిధంగా శబరి అంటే సనాతన ధర్మపరమైన భగవద్భావనావృత్తిగా చెప్పుకోవాలి.[26] అని శబరికి పరమార్థాన్నీ అంతరార్థాన్నీ కల్పించి నిర్వచించారు. డా॥ వేదుల సూర్యనారాయణగారు. వీరి అభిప్రాయం ప్రకారం శబరి అనే పదం పవిత్రమైనది గానే భావించాలి.

## శబరి భక్తిని గురించి అనుశీలిస్తే

వేదకాలం నుండి వేదవ్యాసుని వరకు భక్తి అనే భావాన్ని తపస్సు, ఉపాసన, యోగం అని వ్యక్తం చేయబడి ఉండడం కనిపిస్తుంది. వేద వ్యాసుని తోనే ఈ భక్తి మొదలయిం దనవచ్చు.

మన పూర్వులు మోక్షప్రాప్తి సాధనములుగా జ్ఞాన, కర్మ, భక్తి మార్గము లను నిర్దేశించిరి.

1. జ్ఞాన మార్గము- పరిణత చిత్తులైన మహాయోగులకు తప్ప సామాన్యులకు సాధ్యము కాదు.

2. కర్మ మార్గము- ఇదికూడా జ్ఞానమార్గమువలె కొందరికి మాత్రమే సాధ్యమైనట్టిది. లింగ వర్ణాశ్రమ వయో భేదముల ననుసరించి మానవులు నిర్వహింపవలసిన కర్మకలాపమెంతయో శ్రుతి స్మృతి పురాణాదులందు విహితమైయున్నది. దీనినంతా యథావిధిగా నాచరించుట దుష్కరమనియే చెప్పవచ్చును. కాగా పండితులనక, పామరులనక, పురుషులనక, వృద్ధులనక, బాలురనక యెల్లరికి నందుబాటులో నుండి యనుసరణ యోగ్యమైనది భక్తిమార్గమొక్కటే. 27

అని మోక్షప్రాప్తికి సులభమైన మార్గంగా భక్తిమార్గాన్ని పేర్కొనడం జరిగింది.

"పరానురక్తిరీశ్వరే సాత్వస్మిన్ పరప్రేమరూపా" అనునవి పూర్వులు భక్తికొసంగిన నిర్వచనములు. వీనిని బట్టి భక్తులకు భగవంతునెడగల ప్రేమానురాగాది భావాతిశయమే భక్తియని తేలుచున్నది"28

ఈ నిర్వచనాలవల్ల ఈశ్వరునిపై గాఢానురక్తి పరమమైన ప్రేమ కలిగి ఉండే విధానాన్ని భక్తిగా పేర్కొనవచ్చు. ఇది స్త్రీ పురుషుల మధ్య యేర్పడే ప్రేమానురాగాలకంటే భిన్నమైంది. భగవంతునికి భక్తునికి మధ్య గల సన్నిహిత సంబంధాలకు ఈ భక్తి మారురూపం. భగవత్సంబంధమైన ఈ భక్తి-భావం మాత్రమే అని కొందరూ కాదు రసమని ఉజ్వల నీలమణికర్త గోస్వామి భక్తి రసాయనకర్త మధుసూధన సరస్వతి పేర్కొన్నారు. ఇది నవరసాలలో అంతర్భూతమై ఉందని కొందరు, కాదు, భక్తి అనేది ప్రత్యేక రసమని కొందరు ప్రతిపాదించారు.

శ్లో॥ ద్రుతస్య భగవద్ధర్మా ద్ధారా వాహిక తాంగ తా
సర్వేశే మనసో వృత్తి ర్భక్తిరిత్యభిధీయతే"29

అని మధుసూదన సరస్వతి భక్తిరసాయనంలో భక్తి కిచ్చిన నిర్వచనం. ద్రుతమై ధారావాహికంగా సర్వేశ్వరుని యందు వర్తించే మనస్సు యొక్క వృత్తియే భక్తి అని అతని అభిప్రాయం.

భక్తి రసానికి భగవంతుడు ఆలంబన విభావం, తులసీ చందనాదులు, ఉద్దీపన విభావాలు, నేత్ర భ్రూ విక్షేపాదులు అనుభావాలు, నిర్వేదాదులు, వ్యభిచారీ భావాలు. ఈ విభానుభావ సంచారీ భావాలు ద్రుతచిత్తంలో ప్రవేశించి స్థాయిత్వం పొంది భగవతాకారతారూపమైన మానస వృత్తిని పోషించి పరమానంద సాక్షాత్కారాత్మకమైన భక్తిరసాన్ని ప్రతీయమానం చేస్తుంది - అని పండితాభిప్రాయం. కానీ ఆలంకారికులు మాత్రం నవరసాల్లో భక్తిరసాన్ని చేర్చలేదు.

## భక్తిని గురించి శంకరాచార్యులు

ఆత్మసాక్షాత్కారమే జీవితోద్దేశము - ఆత్మను మరియు పరమాత్మనూ, అభిన్నముగా దలంచి, భజించుదే శంకరాచార్యుని మతానుసారము సర్వోత్కృష్టమైన భక్తి. తన వాస్తవిక స్వరూప అనుసంధానమే భక్తి యనబడును".30 అని ఇంకా భక్తి అంతిమ భూమికను గురించి ఇలా పేర్కొన్నారు.

ఆ పరబ్రహ్మయే నేను నేనే ఆ పరబ్రహ్మను అను జీవబ్రహ్మల అభేదైక్య భావమే భక్తి యొక్క అంతిమ భూమిక".31

ఇది అద్వైత దృష్టితో భక్తిని నిర్వచించిన వైనం -

## భక్తిని గురించి రామానుజాచార్యులు

భక్తిని గురించి రామానుజాచార్యులు - ముక్తికి ఐదు ఉపాయములు కలవు. 1. కర్మయోగము, 2. జ్ఞానయోగము. 3. భక్తియోగము, 4. ప్రపత్తి యోగము, 5. ఆచార్య అభిమాన యోగము. ఈ ఐదు భక్తికి అంగములు కేవలము జ్ఞానముచే ముక్తిలభింప నేరదు. భక్తిచే ప్రసన్నుడై దయామయుడగు భగవానుడు ముక్తి ప్రసాదించును. వేదనాధ్యాన ఉపవాసనాదులచే భక్తి అలవడును.

"అనుకూలత యొక్క సంకల్పము ప్రతికూలత యొక్క త్యాగము సంపూర్ణమగు ఆత్మ సమర్పణము అను వీనితో కేవలము భగవంతునికి శరణాగతుడగుచే ప్రపత్తి ఆత్మసమర్పణ ద్వారానే ముక్తిదొరకును. సర్వనివేదన రూపమగు శరణాగతి భక్తియే భగవంతుని ప్రసన్నతకు ప్రధాన సాధనం"32

ఇది విశిష్టాద్వైత దృష్టితో భక్తిని నిర్వచించిన తీరుకాగా-

## భక్తిని గురించి శ్రీమధ్వాచార్యులు

"మధ్వ మతములో శ్రీహరియే సర్వోత్తముడు. జగత్తు సత్యము. బ్రహ్మాది జీవులు సేవకులు. వారిలో పరస్పర తారతమ్య క్రమము కలదు. జీవుని యొక్క స్వరూపానుగత సుఖానుభవమే మోక్షము. హరి యొక్క నిర్మల భక్తియే ఆ మోక్షమునకు సాధనము."33

ఇది మధ్వ మతమున గల సిద్ధాంత భక్తికి కనిపించే నిర్వచనం.

వీరి అందరి అభిప్రాయాలు అనుశీలిస్తే భగవత్స్వరూపాన్ని తెలుసికోవడం, భగవంతుని ప్రేమించడం, సేవించడం, సర్వం సమర్పించడం, ఉపాసించడం అను గుణాలు భక్తికి ముఖ్యమని తెలుస్తుంది. భక్తి ముక్తి కోసం అవసరం. ఇటువంటి భక్తికి సర్వ ప్రాణులు సమర్థులే అని కూడా దీనివల్ల తెలుస్తూంది.

ఈ భక్తి ముఖ్యంగా శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య శరణాగత, మాధుర్యాది భావాలతో వ్యక్తం చేయబడుతూ ఉంటుంది.

వాల్మీకి రామాయణంలోని శబరి భక్తిని అనుశీలిస్తే ఆమె దాస్య భక్తికి, శరణాగతికి, మధుర భక్తికి, వాత్సల్య భక్తికి ప్రతీకగా ఉందనవచ్చు. నవ విధ భక్తి విధానాలకు శబరి భక్తిని అన్వయింప వచ్చు.

శబరి సేవా భక్తి - మతంగ మహర్షులను శబరి సేవాభావంతో సేవించింది. చివరి క్షణంలో కూడా శబరి గురుసేవాసక్తి వ్యక్తం చేస్తుంది.

శ్రీరాముడు శబరి ఆశ్రమానికి వెళ్ళినపుడు ఆమె తపస్సునూ వ్రతాదులను గురించి ప్రశ్నిస్తూ "కచ్చితే గురుశుశ్రూషా సఫలా చారుభాషిణీ" అని ప్రశ్నిస్తాడు.

అందుకు సమాధానంగా శబరి -

శ్లో॥ అద్యప్రాప్తా తపస్సిద్ధి స్తవసందర్శనాన్మయా
అద్య మే సఫలం తప్తగురువశ్చ సుపూజితాః"34

నీ దర్శనంచే నా తపస్సు ఇప్పుడే పరిపాకమైంది. నా తపస్సు సఫల మైంది. ఇపుడే ఆచార్యుల పూజించినటులయింది. అని శ్రీరామునితో అంటుంది. అనగా ఆమె పూర్వాశ్రమంలో గురు శుశ్రూష చేసినదిగా తెలుస్తోంది. సేవా భక్తికి ప్రతిఫలంగా యోగాభ్యాసాదులను పొందింది. దాని వలన భగత్సాక్షాత్కారాన్ని పొందకలిగింది. రాముని అనుగ్రహానికి పాత్రురాలయింది. అవసానంలో కూడా నేను సేవ చేయుచుండిన గురువుల వద్దకు వెళతాను అనుజ్ఞ ఇమ్మని శ్రీరాముని కోరుతుంది శబరి. దీనివల్ల ఆమె గురుసేవాభావం ఎటువంటిదో వ్యక్తమౌతోంది.

భగవంతుడు భగవద్భక్తుల మీది కంటే భాగవత భక్తులపై ఎక్కువ ప్రేమ చూపుతాడు. భాగవత భక్తులనగా భగవద్భక్తులను భక్తితో సేవాభావంతో సేవించేవారు. అనగా దాసులకు దాసులు భాగవత భక్తు లనబడతారు.

శ్లో॥ యస్య దేవే పరాభక్తిః యథా దేవేతథాగరౌ
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః॥
(శ్వేతాశ్వరోపనిషత్తు 6-23)

అను శ్వేతాశ్వరోపనిషత్తు ప్రవచనానికి లక్ష్యంగా నిలచింది. శబరి గురు సేవా భక్తి దాసులకు దాసిగా సేవించింది. కనుక ఆమెను భగవంతుడు అనుగ్రహించాడు.

## శబరి శరణాగతి తత్త్వం

వేదాంతమునందు చెప్పబడిన పరతత్త్వము విష్ణువే యని శ్రీ రామాయణములో ఉపక్రమము మొదలు ఉపసంహారమువరకు ఆయా యధికారులను ఫల విశేషములను దెలిపి శరణాగతియే పరబ్రహ్మమగు విష్ణువును బొందుటకు పాయమని స్పష్టముగ జెప్పిరి.35

కనుక శబరి శరణాగతివల్ల పరబ్రహ్మ అయిన విష్ణువును పొందింది. రామాయణంలో లక్ష్మణ, గుహ, సుగ్రీవ విభీషణాదుల శరణాగతి నిస్వార్థ మైంది. శబరి మొదట గురు శరణాగతి ద్వారా యోగసిద్ధిపొందింది. తరువాత రామ శరణాగతివల్ల ముక్తిపొందింది శబరి శరణాగతిలో నిస్వార్థపరత్వం నిండి ఉంది.

## శబరి వాత్సల్య భక్తి

శబరి శ్రీరాముని కోసం సుమారు పదమూడు సంవత్సరాల నుండి ఫలాలను దాచింది. అంటే ఆమె వాత్సల్య భక్తి ఎలాంటిదో వ్యక్తం అవుతుంది. రాముడు చిత్రకూట పర్వతం చేరినప్పటినుండి వన్య ఫలాలను శబరి రాముని కోసం సేకరించింది. మధురమైన వాటిని దాచింది. దీనివల్ల శబరి వత్సల భావం ఎంత గాఢమైందో తెలుస్తోంది. వత్సల భావం అనగా పుత్రాదుల మీద కలిగే ప్రేమభావం. శబరిని యశోద, దేవకి, నందాదులవలె వాత్సల్య భక్తికి ప్రతీకగా పేర్కొనవచ్చు.

శ్లో॥ మయాతు వివిధం వన్యం సంచితం పురుషర్షభ,
తవార్థే పురుష వ్యాఘ్ర సంపాయా స్తీర సంభవమ్॥36

"పురుషోత్తమా! నేను పంపాతీరంలోగల అనేక విధాలయిన వన్యఫలాలను నీ కోసం సేకరించి ఉంచాను". అంటుంది శబరి రామునితో ఇది ఆమె వాత్సల్య భక్తికి తార్కాణం.

శబరి భక్తి తత్త్వాన్ని లోతుగా అనుశీలిస్తే నవవిధ భక్తి తత్త్వాలు ఆమెలో ద్యోతకమౌతాయి.

## నవవిధ భక్తి పద్ధతులు - శబరి

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణో స్మరణం పాద సేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మ నివేదనం॥ 37

అని శ్రీమద్భాగవతంలో తొమ్మిది విధాలయిన భక్తి విధానాలు చెప్పబడి ఉన్నాయి.

1. శ్రవణం 2. కీర్తనం 3. స్మరణం 4. పాదసేవనం 5. అర్చనం 6. వందనం 7. దాస్యం 8. సఖ్యం 9. ఆత్మ నివేదనం.

**1. శ్రవణం** - భగవంతుని నామరూప గుణ ప్రభావాలను లీలాదులను రహస్యాలైన భక్తి ముక్తిదాయకాలయిన కథలను శ్రద్ధాసక్తులతో విని తన్మయం చెందడం శ్రవణ భక్తి.

శబరి మతంగుని వలన శ్రీరాముని నామరూప గుణ ప్రభావాలను వినినది. అందుచేతనే—

శ్లో॥ అద్య మే సఫలం జన్మస్వర్గశ్చైవ భవిష్యతి,
త్వయి దేవ వర్ణే రామపూజితే పురుషర్షభ॥38

అనే శ్లోకంలో శబరి రాముణ్ణి విష్ణువుగా ప్రస్తుతిస్తుంది. కనుక ఆమె భక్తిని శ్రవణ భక్తికి అనువర్తింపవచ్చు.

**2. కీర్తనం** — భగవంతుని రూప గుణ ప్రభావతత్త్వాదులను శ్రద్ధా భక్తులతో ఉచ్చరిస్తూ, శరీరంలో పులకింత, గద్గదము, కన్నీరు, మానసోల్లాసం, తన్మయతాదుల అనుభవించడం కీర్తనంలోని అంతర్భాగాలు.

శబరి రాముణ్ణి ఇలా కీర్తిస్తుంది.

శ్లో॥ చక్షుసా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన
గమిష్యామ్యక్షయాన్ లోకాన్ త్వత్ప్రసాదా దరిందమ॥39

రామా! నీ నిర్హేతుక కటాక్షం చేత పరిశుద్ధురాలు అయినాను. ఓ శత్రు సంహారకుడా ఆచార్యానుగ్రహంతో కూడిన నీ అనుగ్రహంవల్ల పునరావృత్తి లేని పరమపదం పొందుతాను. అని రాముని ప్రభావాన్ని గుణాలను శబరి కీర్తించడంచేత ఆమె భక్తిని కీర్తనభక్తికి కూడా అన్వయించవచ్చు.

**3. స్మరణ :-** పరమాత్మ రూపగుణ విభవాదులను తత్త్వాది రహస్యాలను మననం చేసుకొంటూ భగవంతుని స్వరూపంలో లీనమవడం దీని స్వభావం.

శబరి తన గురువైన మతంగ మహర్షి పుణ్యలోకానికిపోతూ ఈ ఆశ్రమానికి రాముడు లక్ష్మణుతో కూడి వస్తాడు. వారికి ఆతిథ్యం ఇచ్చి సత్కరించు. "అతని దర్శనంవల్ల నీకు శాశ్వతమైన, శ్రేష్ఠమైన పరమపదం లభిస్తుంది." అని చెప్పినప్పటి నుండి శబరి రామనామాన్నే అనుక్షణం స్మరిస్తూ రామాగమనం కోసం నిరీక్షిస్తూ ఉంటుంది. కనుక స్మరణ భక్తికి కూడా ఉదాహరణంగా శబరి భక్తిని పేర్కొవచ్చు.

**4. పాదసేవనం :-** భగవంతుని దివ్యమంగళ విగ్రహానికీ, పాదార విందాలకు శ్రద్ధా భక్తులతో పూజ చేయడం మనసా, వాచా, కర్మణా భగవత్ కైంకర్యంలో లీనమవడం పాదసేవన భక్తి.

శబరి తన ఆశ్రమానికి వచ్చిన రామలక్ష్మణులకు పాదపూజ చేస్తుంది.

శ్లో॥ తావేద్దృష్ట్వా తదా సిద్ధాస్సముత్థాయ కృతాంజలిః
రామస్య పాదౌ జగ్రహ లక్ష్మణస్య చ ధీమతః
పాద్యమాచమనీయం చ సర్వం ప్రాదాద్యథావిధి॥ 40

శబరి తన ఆశ్రమానికి రామలక్ష్మణులు రాగానే లేచి అంజలి చేసి పాదాలు పట్టుకొని శాస్త్రోక్తంగా వారికి పాద్యం ఆచమనీయం ఆతిథ్యం ఇత్యాది సర్వోపచారాలు చేస్తుంది. కనుక శబరి భక్తిని పాదసేవన భక్తిపరంగా కూడ పేర్కొవచ్చు.

**5. అర్చనం :-** పరమాత్మ స్వరూపాన్ని సాక్షాత్కరించుకొని, లేదా చిత్రపటాదులను ముందుంచుకొని, లేక మనోనేత్రంతో భగవంతుని రూపాన్ని ఊహించుకొని నానా విధాలయిన ఉపచారాలతో పూజించుట, ఆయన ప్రభావాన్ని తలచుకొంటూ పులకితగాత్రులైతే అర్చనా భక్తి అనబడుతుంది.

శబరికి శ్రీరామచంద్ర సాక్షాత్కారం లభించింది తన్మయురాలై ఆమె రాముని సేవించింది. ఉపచారాలు చేసింది. కనుక ఆమె భక్తి అర్చనా భక్తికి కూడా అన్వయించవచ్చు.

**6. వందనం :-** శాస్త్రాలలో చెప్పబడిన విధంగా భగవంతుని రూపాన్ని తయారు చేసి, లేక ఆయన మూర్తిని మనస్సులో ధ్యానిస్తూ ఆయన పాదపద్మాలకు మనస్ఫూర్తిగా గౌరవ భక్తులతో నమస్కరించే విధానాన్ని వందన భక్తి అంటారు.

శబరి సాక్షాత్తు రాముని పాదపద్మాలను తాకి నమస్కరించింది. తన ఆశ్రమానికి రామలక్ష్మణులు రాగానే ఆమె పూజ్యభావంతో మనస్ఫూర్తిగా రామ

పాద పద్మాలకు నమస్కరిస్తుంది కనుక ఆమె భక్తిని వందన భక్తికి కూడా తీసుకోవచ్చు.

**7. దాస్యభక్తి:-** పరమాత్మ రూపగుణ విభవైశ్వర్యాదులు, తత్త్వరహస్యాలు అవగాహన చేసుకొని ఆయనకు సేవచేస్తూ తనను ఒక సేవకునిగా పరమాత్మని సేవ్యునిగా భావిస్తే అది దాస్యభక్తి "త్వద్దాసదాస చరమావధిదాస దాసా" అనికులశేఖరుని భావన.

ఈ దాస్యభక్తికి శబరి చక్కని ఉదాహరణ. శబరి తొలుత మతంగ ఋషికి సేవచేసింది. మతంగ మహర్షి మహామహిమాన్వితుడు భగవత్స్వరూపం తెలిసినవాడు. కనుకనే శబరి ఆయనకు దాసిగా సేవ చేసింది. తరువాత రాముడు ఆశ్రమ సీమకు వచ్చినపుడు సేవకురాలిగా అర్చించింది. కనుక శబరి భక్తిని దాస్యభక్తికి కూడ ఉదాహరణగా పేర్కొవచ్చు.

**8. సఖ్యం :-** భగవంతుని ప్రభావాన్ని తత్వాన్ని రహస్య మహిమలను, తెలుసుకొని విశ్వాసయుక్త మయిన మైత్రితో ఆయన కనుకూలంగా అనన్యమైన ప్రేమానురాగాలు కలిగి నిరంతరం ఆనందంగా ఉండడమే సఖ్యభక్తి.

శ్లో॥ కచ్చిత్తే నియతః క్రోధి అహరశ్చ తపోధనే,
కచ్చిత్తే నియమాః ప్రాప్తాః కచ్చిత్తే మనస్సుఖమ్॥

అని స్నేహ పూర్వకంగా భగవంతుడే శబరిని ప్రశ్నించడం చేత శబరి భగవంతుని తత్వాన్ని, ప్రభావాన్ని మహిమనూ తెలిసి అతనిపై అమిత విశ్వాసంతో కూడిన భక్తి శబరికి ఉంది కనుక సఖ్య భక్తికి కూడ శబరి భక్తిని సమన్వయం చేయవచ్చు.

**9. ఆత్మనివేదనం :-** పరమాత్మయొక్క సకలలీలలను మహత్వాలను తెలుసుకొని అహంకార మమకారాలను త్యజించి పరమాత్మను తలచుకొంటూ ఆర్తిప్రపత్తులతో నిష్కామ బుద్ధితో సర్వకార్యాలను నిర్వవరిస్తూ కర్తృత్వాన్ని ఆయనకు అర్పించడం ఆత్మనివేదన భక్తి.

శబరి సిద్ధిపొందిన యోగాభ్యాసం కలది. సంశ్రితవ్రత, అహంకార మమకారాల జయించిన శ్రమణి. తన సర్వస్వాన్ని సర్వేశ్వరార్పితం చేసి యోగాగ్నిలో దేహాన్ని హోమంచేసి పుణ్యలోక పదప్రాప్తిని పొందిన పుణ్యచరిత ఆమె ఆత్మ నివేదనమే కాదు ఆత్మను కూడ పరమాత్మకు అర్పించిన పరమ భక్తురాలు.

ఈ విధంగా శబరి నవవిధ భక్తి విధానాలతో భగవంతుని అర్చించి అనన్యఅయి, అనన్యశరణ్య అయి, అన్యోపమమై అనన్య ప్రయోజన అయి సర్వదా సర్వత్రా పవిత్ర జీవితాన్ని గడిపిన పుణ్యచరితగ దర్శనమిస్తుంది.

శబరి భక్తి అపూర్వమైంది. అమలమైంది. ఆదర్శవంతమైంది. అంతర్యాగరూపమైంది. అపారమైంది. అమరమైంది. వాల్మీకి శబరిలో నిక్షిప్తీకరించిన భక్తితత్త్వం నిర్మలమైంది. నిరుపమానమైంది. నిర్మాణాత్మకమైంది. నిగూఢమైంది.

వాల్మీకి శబరిని ధర్మచారిణిగ, ధర్మనిపుణగా, సన్యాసినిగా తపోధనిగా సంశ్రితవ్రతగా సిద్ధమైన యోగాభ్యాసం కలదిగా తపఃస్సిద్ధి పొందినదిగా పేర్కొనడమే కాక నవవిధ భక్తి పద్ధతులు ఆమెలో పొందుపరిచాడు.

# అధోజ్ఞాపికలు

## ప్రథమ ప్రకరణం


1. శ్రీ వారణాసిరామమూర్తి "రేణు" హిందీ రామాయణాలు; రామాయణ సుధాలహరి, యువభారతి, సికిందరబాద్ 500 003. 1976
2. వాల్మీకి రామాయణం, బాలకాండం, ఆరంభ ప్రార్థనా శ్లోకాలు.
3. మురారి, అనర్ఘరాఘవ నాటకము, ప్రథమాంకము, శ్లోకం - 9.
4. జయదేవుడు, ప్రసన్నరాఘవము.
5. మైథిలీ శరణ గుప్త, సాకేత్, పుట-1, ప్రకాశన్, చిరగావ్, ఝాన్సి.
6. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షము అవతారిక, పుట-4, వల్లీ పబ్లికేషన్సు, మారుతీనగర్ః విజయవాడ, 520 004.
7. Swami Vivekananda, the Complete works of Swami Vivekananda, Volumu No.IV Page-63.
8. I bid - Page - 75.
9. రవీంద్రనాథ్ ఠాగూర్, తెలుగు అనువాదం, డా॥ బెజవాడ గోపాల్ రెడ్డి, సారస్వత వ్యాసములు సంపుటి - 3 ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ హైదరాబాద్.
10. Rajagopala Chari, Ramayana Page - 175 Bharatiya Vidya Bhavan Bombay - 1957.
11. A history of Indian literature, Vol Part II Second Edition - 1963.
12. డా॥ మల్లాది గోపాల కృష్ణ శర్మ, శ్రీమత్‌రామాయణ వైభవం, డా॥ దివాకర్ల వేంకటావధాని, ప్రరోచనం, ఆర్ష భారతి ప్రకాశన్, అనంతవరం, గుంటూరు జిల్లా - 1971.

13. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, అభినవ లోచనం, పు॥ 85 యువభారతి; సికిందరాబాద్ - 500 003. 1983
14. వి. యస్. శ్రీనివాసశాస్త్రి, రామాయణ ఉపన్యాసము, తెలుగు సేత, వేలం పాటు లక్ష్మీనరసయ్య, గూడురు - 1981.
15. వాల్మీకి రామాయణం, బాలకాండము, నాలగవ సర్గ శ్లోకం - 2.
16. మల్లాది సూర్యనారాయణశాస్త్రి, సంస్కృత వాఙ్మయ చరిత్ర, ద్వితీయ సంపుటి, పుట - 39.
17. వాల్మీకి రామాయణము, బాలకాండము, ప్రథమ సర్గ శ్లోకం - 56.
18. Ibid - శ్లోకం నెం. 57.
19. Ibid - అరణ్యకాండ సర్గ -73, శ్లోకకాలు - 25 నుండి 29 వరకు.
20. దశరూపకసారము, పుట - 21, ఆంధ్ర సారస్వత పరిషత్తు, ద్వితీయ ముద్రణ, హైదరాబాద్ - 1966.
21. Ibid - పుట - 22.
22. Wiswanatha Satyanarayana, what is Ramayana to me, Page-97, Maruthi nagar Vijayawada - 520004.
23. డా॥ మల్లాది గోపాలకృష్ణశర్మ, శ్రీమత్‌రామాయణ వైభవము, పుట - 5 ఆర్షభారతీ ప్రకాశన్, అనంతవరం, గుంటూరుజిల్లా 1971.
24. వాల్మీకి రామాయణము, అరణ్యకాండ, సర్గ - 73, శ్లోకం - 25.
25. అధ్యాత్మ రామాయణము, అరణ్యకాండ, దశమసర్గ.
26. డా॥ వేదుల సత్యనారాయణ, అంతరార్థ రామాయణము, పుట - 82 శ్రీవాణీ నిలయం, టౌనుహాలు వెనుకవీధి, తణుకు; పశ్చిమగోదావరిజిల్లా.
27. శ్రీమహాభారతము, మొదటి సంపుటము, పీఠిక, పుట 93. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1977.
28. Ibid - పుట - 95.
29. I bid ,, ,,
30. అమృత వాహిని రెండవ సంపుటము, పుట 439, సర్వోదయాశ్రమము, సర్వేలు. 1969.

31. I bid పుట 441.

35. శ్రీ మహాభాగవతము, మొదటి సంపుటము, పీఠిక, పుట 95.
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1947.

33. అమృత వాహిని, రెండవ సంపుటము; పుట-442, సర్వోదయాశ్రమము సర్వేలు - 1969.

34. వాల్మీకి రామాయణము, అరణ్యకాండ, సర్గ-74, శ్లోకం-11.

35. గట్టుపల్లి శేషాచార్యులు, వాల్మీకి రామాయణ పీఠిక, బాలకాండము, శశిలేఖా ముద్రాక్షరశాల, చెన్నపురి, 1902.

36. వాల్మీకి రామాయణము, అరణ్యకాండ, సర్గ-74. శ్లోకం-17.

37. సప్తగిరి, పుట 21. తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాస పత్రిక, ఏప్రిల్-1983.

38. వాల్మీకి రామాయణము, అరణ్యకాండ, సర్గ-74, శ్లోకం-12.

39. Ibid - శ్లోకం-13.

40. Ibid - శ్లోకం-6,7.

41. Ibid - శ్లోకం-8.

# ద్వితీయ ప్రకరణం

## అధ్యాత్మ రామాయణంలో శబరి పాత్రతత్త్వం

### అధ్యాత్మ రామాయణం - ఒక తాత్త్విక కావ్యం

అధ్యాత్మ రామాయణం వాల్మీకి కృతమని విశ్వామిత్ర మహర్షి రచించాడని వాదాలున్నాయి. కాని అది వేదవ్యాస ప్రణీతం అనే ప్రతీతి. సంస్కృత వాఙ్మయంలో వ్రాయబడిన రామాయణాలు సుమారు 108 వరకు కలవట. అందు ప్రథమస్థానం వాల్మీకి రామాయణానిది కాగా ద్వితీయస్థానం అధ్యాత్మ రామాయణానిదని పలువురు పండిత విమర్శకుల అభిప్రాయం. అయినా అధ్యాత్మ తత్త్వపరంగా చెప్పబడిన రామాయణాలలో అద్వితీయస్థానం అధ్యాత్మ రామాయణానిది.

వాల్మీకి రామాయణంవలె అధాత్మరామాయణం స్వతంత్ర కావ్యం కాదు. కాని, వాల్మీకి రామాయణంలోని భక్తితత్త్వానికి ఇది వ్యాఖ్యాన గ్రంథమనవచ్చు. వాల్మీకి రామాయణంలోని రాముని అప్రాకృత పురుష తత్త్వాన్ని అధ్యాత్మ రామాయణం వ్యాఖ్యానిస్తుంది.కాబట్టి దీనిని ఒక తత్త్వకావ్యంగా పేర్కొనవచ్చు. భక్తి ప్రబోధాత్మకమే దీనికి ఆత్మగా చెప్పవచ్చు. అధ్యాత్మ రామాయణం బ్రహ్మాండ పురాణంలో ఒక భాగం. కాబట్టి దీనిలో కొన్ని పురాణ లక్షణాలు కనిపిస్తాయి. వేదాల్లో ప్రతిపాదింపబడిన కర్మ, జ్ఞాన ఉపాసన మార్గాలు భక్తితత్త్వం దీనిలో ప్రతిపాదింపబడింది.

అధ్యాత్మ రామాయణంలో జీవిత వ్యాఖ్యానికి చోటు తక్కువ. జీవిత పరమార్థాన్ని వాఖ్యానించడమే దీని ముఖ్యోద్దేశంగా కనిపిస్తుంది. ఆ దృష్టితోనే రామకథను అన్వయించి అధ్యాత్మ రామాయణం విరచింపబడింది అనవచ్చు తత్త్వదృష్టితో అధ్యాత్మరామాయణాన్ని సమీక్షించేస్తే వాల్మీకి 'రామాయణానికిది వివరణాత్మకమైన గ్రంథంగా కనిపిస్తుంది. అద్వైతదృష్టితో దీని సృష్టి జరిగింది.

అధ్యాత్మ రామాయణంలో పురాణ కావ్యలక్షణ సమ్మిశ్రమం కనిపిస్తుంది. కాని అధ్యాత్మ విషయ ప్రాధాన్యత సర్వత్ర సంతరించుకొంది. కనుక దీనిని అధ్యాత్మ రామాయణమనడం ఔచితీమహితంగా ఉంది.

వాల్మీకి రామాయణంలో శ్రీరాముడు సంపూర్ణ కావ్యనాయక లక్షణ సమన్వితుడైన పరిపూర్ణ కథానాయకుడు. అధ్యాత్మ రామాయణంలో శ్రీరాముడు పరిపూర్ణ పరమాత్మ స్వరూపుడు, వాల్మీకి రామాయణంలో నిగూఢమైన రామ తత్త్వాన్ని అధ్యాత్మ రామాయణం విశ్లేషణాత్మకంగా వివేచన చేస్తుంది. కాబట్టి దీనిని ఒక తాత్త్వికకావ్యం అనవచ్చు.

నారదుడు బ్రహ్మను కలియుగంలో మానవులు చేసే నానా విధాలయిన పాప కర్మాలకు పరిష్కారోపాయాన్ని అడగడంతో అధ్యాత్మ రామాయణం ఆరంభమవుతుంది.

శ్లో॥ పురాగిరి సంభూతా శ్రీరామార్ణవ సంగతా
అధ్యాత్మ రామ గంగేయం పునాతి భువన త్రయమ్.1

అధ్యాత్మతత్త్వ ప్రతిపాదనా ప్రవాహ రూపమైన అధ్యాత్మ రామాయణం గంగా నది లాంటిది. అది త్రిరుపురాసుర సంహారకుడైన శంకరుడను పర్వతం నుండి జనించి శ్రీరాముడనే సముద్రంలో కలిసి ముల్లోకాలను పవిత్రం చేస్తూంది అని అలంకారయుక్తంగా అధ్యాత్మ రామాయణావిర్భం, దాని మహత్వం చెప్పబడి ఉంది.

అధ్యాత్మ రామాయణం శంకరునిచే పార్వతికి చెప్పబడింది. అది ముల్లోకాలను పవిత్రం చేస్తుంది అని దీని భావం. పై శ్లోకంలో అధ్యాత్మిక తత్త్వ రహస్యాలను తెలియచేసే గూఢార్థ ప్రతిపాదితాలయిన పదాలు వాడబడి ఉండటం గమనార్హం.

శ్లో॥ అధీతేషు చ వేదేషు శాస్త్రేషు వ్యాకృతేషు చ
యత్ఫలం దుర్లభంలోకే తత్ఫలం తస్య సంభవేత్.2

వేదాధ్యయనం చేసి శాస్త్రాల వ్యాఖ్యానించినాగూడ పొందలేని ఫలాన్ని అధ్యాత్మ రామాయణం వల్ల పొందవచ్చు.

వేదాధ్యయన శాస్త్ర చర్చవల్ల తత్త్వం తెలియదు. దానికి సాధనాపూర్వకమైన అనుభవం ఉండాలి. అధ్యాత్మ రామాయణం అటువంటి అనుభూతిని తేలికగా కల్గిస్తుంది.

దీనిలో సీతను యోగమాయకు ప్రతీకగానూ శ్రీరామచంద్రుణ్ణి పరమేశ్వరునికి ప్రతీకగా సృష్టించబడింది. కాబట్టి దీనిని ప్రతీకాత్మక లక్షణం గల కావ్యంగా పేర్కొవచ్చు.

## శబరి అతిథ్యం

రామాయణంలో గుహుని కౌగిలి, శబరి అతిథ్యం, అంజనేయుని అంజలి, సుగ్రీవుని కరచాలనం, విభీషణుని శరణాగతి విశిష్టతరమైన సన్నివేశాలు. అర్థస్ఫూర్తిగల సమావేశాలు ఒక్కొక్కటి ఒక్కొక్క ఉన్నత తత్త్వానికి ప్రతీకలు.

అందులో శబరి ఆతిథ్యం, భగవంతునికి భక్తియే ప్రధానం కానీ కుల, మత, లింగభేదాలు కాదు అని నిరూపించడానికి ప్రతీకగా ఉంది.

అధ్యాత్మ రామాయణంలో అరణ్యకాండ దశమ సర్గలో శబరి వృత్తాంతం చెప్పబడి ఉంది. శాప విముక్తుడయిన కబంధుడు శబరిని గురించి రామునికి తెలియచేస్తూ—

శ్లో॥ భక్తాత్వత్పాద కమలే భక్తి మార్గ విశారదా
తాం ప్రమాహి మహాభాగా సర్వం తే కథ యిష్యతి.[3]

"శబరి భక్తి మార్గాన్ని అవగతం చేసుకొన్న స్త్రీ. నీ పాదకమలాలను ఆమె మనసులో నిలిపి నిన్నే ధ్యానిస్తోంది. నీ వామె దగ్గరకు వెళ్ళు ఆపై నీ కర్తవ్యాన్ని ఆమె చెబుతుంది" అని కంబంధుడు శ్రీరామునికి తెలియచేస్తాడు.

అధ్యాత్మ రామాయణంలో శబరి శ్రీరామునికి కర్తవ్యోపదేష్టంగా పేర్కొబడి ఉండటం గమనార్హం.

శబరి ఆతిథ్యం స్వార్థ రహితం, నిష్కామ సహితం, వాత్సల్య పూరితం అయినట్టిది. వాల్మీకి రామాయణంలో శబరి హీనకుల సంజాతగ చెప్పబడలేదు.

అధ్యాత్మ రామాయణంలో శబరి హీనజాతి సముద్భవ అని స్పష్టంగా చెప్పబడి ఉంది. తరువాత వెలసిన అసంఖ్యాక రామాయణాల్లో శబరి శబరజాతి స్త్రీగానే పేర్కొన బడింది.

శబరి వాల్మీకి రామాయణంలో వృద్ధురాలుగా, మతంగ మహర్షికి సేవకురాలుగా, యోగసిద్ధురాలుగా, నియమవ్రతం కలిగినదిగా, రామభక్తురాలుగా చెప్పబడింది. అధ్యాత్మ రామాయణాదుల్లోనూ ఈ విషయాల్లో భిన్నత్వం లేదు. కాని, శబరి ఆతిథ్య విషయంలో మాత్రం రామాయణకర్తలు భిన్న దృక్పథాలు ప్రదర్శించారు.

వాల్మీకి రామాయణంలో శబరి పంపాతీరంలో గల నా నా విధాలయిన ఫలాలను రామునికోసం సేకరించి ఉంచినట్లు మాత్రం చెప్పబడి ఉంది.

అధ్యాత్మ రామాయణంలో శబరి ఆతిథ్యాన్ని గూర్చి ఇలా చెప్పబడి ఉంది. రామలక్ష్మణులు శబరి ఆశ్రమానికి వెళ్ళగానే శబరి వారిని చూసి లేచి ప్రదక్షిణ నమస్కారాలు చేస్తుంది.

శ్లో॥ పతిత్వా పాదయోరగ్రే హర్ష పూర్ణాశ్రులోచనా
స్వాగతే నాభినంద్యాథ స్వాసనే సంన్య వేశయత్.4

ఆమె ప్రభువైన శ్రీరాముని పాదపద్మాలకు నమస్కరించి ఆనందాశ్రువులు ధారగా ప్రవహిస్తూ ఉండగా స్వాగత మిస్తుంది. తాను కూర్చునే ఆసనంపై కూర్చొబెడుతుంది.

భక్తి ప్రపత్తులతో రామలక్ష్మణుల పాదాలను ప్రక్షాళనం చేసి ఆ జలాన్ని తన శిరస్సుపై చల్లుకొంటుంది. అత్యంత ఆదరంతో అర్ఘ్య పాద్యాదులతో పూజిస్తుంది. ఆ తరువాత—

శ్లో॥ సంపూజ్య విధి ప్రదామం ససౌమిత్రిం సపర్యయా
సంగృహీతాని దివ్యాని రామార్థం శబరీముదా
ఫలాన్యమృత కల్పాని దదౌ రామాయ భక్తితః
పాదౌ సంపూజ్య కుసుమైః సుగంధైః సానులేపనైః
కృతాతిథ్యం రఘుశ్రేష్ఠ ముపవిష్టం సహానుజం
శబరీ భక్తిసంపన్నా ప్రాంజలిర్వాక్య మబ్రవీత్.5

అని మాత్రం శబరి ఆతిథ్యాన్ని గురించి అధ్యాత్మ రామాయణంలో చెప్పబడి ఉంది. శబరి రామునికి మధురమైన ఫలాలను ఇచ్చినట్లుందే కానీ రుచి చూసి ఎంగిలి ఫలాలను ఇచ్చినట్లు లేదు.

వాల్మీకి రామాయణంలో కూడా ఉచ్ఛిష్ట ఫలాల ప్రస్తావనగానీ, ప్రసక్తి గాని కనిపించదు.

శ్లో॥ 'మయాతు వివిధం వన్యం సంచితం పురుషర్షభ
తవార్థే పురుషవ్యాఘ్ర పంపాయాస్తీర సంభవమ్'॥6

అని మాత్రమే చెప్పబడి ఉంది. కాబట్టి ఈ ఎంగిలి ఫలాల ప్రస్తావనం అవాల్మీకమనీ, అనధ్యాతంకమనీ నిర్ధారించవచ్చు. కానీ ప్రపంచంలో శబరి ప్రతి ఫలాన్నీ కొరికి రుచిచూసి ఆతిథ్య సమయంలో శ్రీరామునికి సమర్పించిందనీ రాముడా ఉచ్ఛిష్ట ఫలాలను ఆరగించాడనీ ప్రబల ప్రచారం చెంది ఉంది.

ఈ ప్రచారానికి ఆధారమేమిటి? శ్రీరాముడు శబరి ఎంగిలి ఫలాలు భక్షించడం సమ్మతమా? అనే విషయాన్ని కొందరి రామాయణ వ్యాఖ్యాతల అభిప్రాయాలను అనుశీలించి నిర్ధారణ చేయవలసి ఉంది. వాల్మీకి రామాయణానికి సంస్కృతంలో వ్యాఖ్యానం రాసిన గోవిందరాజులు ఈ విధంగా వ్యాఖ్యానించారు.

"వన్యశబ్దేన ఫలమూలదిక ముచ్యతే. వివిధమత్యనేన ఫలమూలాది భేద ఉచ్యతే, సంచిత మిత్యనేన రామస్య చిత్రకూటాగమనాత్, ప్రభృతి సంపాది తత్వం ఆదరేణ గుప్త్యత్యంచ, తత్తత్ ఫల జాతీయమాధుర్యం పరీక్ష స్థాపిత మితి సంప్రదాయః."

శ్రీరాముడు చిత్రికూటానికి వచ్చినప్పటి నుండి (ఈ విషయం మతంగ మహర్షులు దివ్యలోకానికి వెళ్ళే సమయంలో శబరికి తెలియచేస్తారు) వన్య ఫలాలను కందమూలాలను వివిధ రకాలైన వాటిని సేకరించింది. ఆ ఫలాలను కంద మూలాలను వివిధ రకాలైన వాటిని సేకరించింది. ఆ ఫల జాతీయ మాధుర్యాన్ని పరీక్షించి దాచింది. అని గోవిందరాజుల అభిప్రాయం.

తిలక వ్యాఖ్యాత కూడ ఇదే అభిప్రాయాన్ని వ్యక్తంచేశాడు. వావిలికొలను సుబ్బారావుగారి అభిప్రాయం ఇలా ఉంది.

"ఫలములను కాని కందమూలములను కాని రుచి పరీక్షించవలయునన్న వాటిని కొరికి చూడవలయునగదా! కొరికినచో అవి ఉచ్ఛిష్టములగును గదా? కలుగుటకు ఆస్కారము కలదు. జాతి మాధుర్యము ననుటచేత ఒక జాతి లేక ఒక చెట్టుపండ్లలో ఒకదానిని తిని చూసిన ఆ జాతి లేక ఆ చెట్టుఫలాల మాధుర్యం తెలియును. అట్లు ఆ జాతి ఫలములలో ఒకదానిని తినినంత మాత్రాన ఉచ్ఛిష్ట మగునా? అన్నది ఒకప్రశ్న అట్టిది ఎంగిలియే.

ఉత్ + శిష్టము = భుజించి ఎక్కువ కాగా మిగిలినదని యర్థము. భుజించుట యనగా నేయింద్రియముతోనైన ననుభవించుట. ఒకడొక అరటిపండులో కొంచెము త్రుంచి నోరవేసికొనినఁ దక్కిన పండు ఉచ్ఛిష్టము. కొరికి తినవలసిన పనిలేదు. గిల్లి నోటవేసికొననఁజాలును. ఒక గెలలో నొకపండు తినిన దక్కిన పండ్లన్నియు వాని యుచ్ఛిష్టమే.[7]

వాసుదాసుగారి అభిప్రాయానుసారం జాతి మాధుర్యాన్ని పరీక్షించినా ఉచ్ఛిష్టమే అనడం స్పష్టం. శబరి జాతిమాధుర్యాన్ని పరీక్షించి దాచిననూ ఆ ఫలాలు ఉచ్ఛిష్టాలే అని వీరి అభిమతం.

గోవిందరాజుల అభిప్రాయం ప్రకారం జాతిమాధుర్యం పరీక్ష చేస్తే అది సంప్రదాయ విరుద్ధం కాదని తెలుస్తూంది. తిలక వ్యాఖ్యాతకర్త అభిప్రాయం గోవిందరాజుల అభిప్రాయమే ఉచితమైందిగా తెలియచేస్తూంది.

అసలు ఈ ఎంగిలి ఫలాలు శబరి రామునికి సమర్పించినదన దానికి మూలం జనశ్రుతా! లేక ఎక్కడయినా చెప్పినట్లు ఆధారం ఉందా? అని పరిశీలిస్తే రంగనాథ రామాయణాదులలో చోటుచేసుకొన్న అవాల్మీకాలలో ఇది కూడా ఒకటనీ దీనికిమూలం పద్మపురాణ ఉత్తర ఖండంలో ఉందని తెలుస్తోంది. చాలా మంది ఈ ఎంగిలి ఫలాల చర్చ సందర్భంలో పద్మపురాణ ఉత్తర ఖండంలోని ఈ క్రింది భాగాన్ని ఆధారంగా చూపుతుంటారు—

శ్లో॥ ప్రత్యుద్గమ ప్రణమ్యాథని వేశ్య కుశ విష్టరే
పాద ప్రక్షాళనం కృత్వా, తత్తోయం పాపనాశనమ్
శిరసాధార్య పీత్వాచ, లెవ్యైః పుష్పైరథార్చయేత్
ఫలాని సుపక్వాని మూలాని మధురాణి చ
స్వయ మాస్వాద్వ మాధుర్యం, పరీక్ష్య పరిభక్ష్యచ
పశ్చాన్ని వేదయామాస, రాఘవాభ్యాం దృఢవ్రతా॥[8]

దీనిలో "స్వయమాస్వాద్య మాధుర్యం పరీక్ష్య పరిణక్ష చ" అని ఉండటం చేత శబరి తాను కొరికిన ఫలాలనే రామునికి ఇచ్చిందని భావించాలి. కాని ఆది యుక్తంకాదని శబరి, జాతి మాధుర్యాన్ని పరీక్షించిన తరువాత ఆ జాతిఫలాలను రామునికి నివేదించింది అనే అర్థం యుక్తమని, ఈ అర్థమే రామాయణ వ్యాఖ్యాతలకు అభీష్టమైందని కొందరు పేర్కొన్నారు.

పై శ్లోకంలో 'స్వయమాస్వాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్యచ' అని స్పష్టంగా ఉండగా వీరు దానిని మరొక విరంగా వ్యాఖ్యానించడం పరికిస్తే శబరివంటి స్త్రీ ఎంగిలిఫలాలను రామునివంటివాడు ఆరగించాడంటే అతని పవిత్రతకు మచ్చ కలుగుతుందనే వీరివిచారంగా భావించవచ్చు.

వాసుదాసుగారు ముద్రితములయిన పద్మపురాణాల్లో ఈ వాక్యాలు లేవంటున్నారు.

"ముద్రితములైన పద్మపురాణములందు ఈ వాక్యములు లేవు. ఈ పాఠమెందుండి గ్రహింపబడినదో నాకు తెలియదు. అనితాను రామాయణానికి వ్రాసిన మందర వ్యాఖ్యానంలో పేర్కొన్నారు. తాను చూసిన పద్మపురాణ పాఠం ఈ క్రిందివిధంగా ఉందని ఉదహరించారు.

శ్లో॥ ప్రత్యుద్గమ్య ప్రణమ్యాథ నివేశ్య కుశనిష్టరే
పాద ప్రక్షాళనం కృత్వా వన్యైః పుష్పైస్సుగంధిభిః
అర్చయామాస భక్త్యా వై హర్ష నిర్భరచేతసా
ఫలాని చ సుపక్వాని, మూలాని మధురాణి చ
నివేదయామాస తదా, రాఘవాభ్యాం దృఢవ్రతా॥[9]

అనిమాత్రమే ఉందని దీనిలో ఉచ్ఛిష్ట ఫలాల ప్రసక్తి లేదని తెలిపారు. దీని ప్రకారం ఎంగిలి ఫలాల ప్రసక్తి పద్మపురణంలో కూడలేదనే చెప్పాలి.

వాసుదాసుగారు ముద్రితాలైన పద్మపురాణాలలో ఈ వాక్యాలు లేవన్నారు. కాని అముద్రిత తాళపత్ర గ్రంథాల్లో ఈ వాక్యాలుంటే ఆధారంగా గ్రహింపవచ్చుగదా! ఒకొ్కక్కప్పుడు ముద్రిత ప్రతులకంటే తాళపత్ర ప్రతులలోని

విషయాలను ఆధారంగా గ్రహించడం ఉత్తమంకదా! తాళపత్ర ప్రతుల్లోని ఆధరాలే శ్రేష్ఠప్రామాణికాలని పరిశోధకుల అభిప్రాయం కదా! అలాంటప్పుడు ముద్రిత ప్రతుల్లో ఆ పాఠం లేనంత మాత్రాన పద్మపురాణంలో ఆ పాఠమే లేదనడం ఉచితం కాదు.

ముద్రిత ప్రతులకుమూలం అముద్రిత ప్రతులే. ఒక గ్రంథాన్ని ముద్రాపకులు ముద్రించేటప్పుడు గ్రంథ పరిష్కారంచేసే సందర్భంలో కొందరి కొన్ని ఛాందస భావాల బలహీనతవల్ల మూలంలోని విషయాలను లుప్తీకరించడానికి కూడ వెనుకాడరు. ఇటువంటి సందర్భాలు తరచుగా కనిపిస్తాయి యతిప్రాసలను ఎత్తివేసిన సందర్భాలు, పదాలనూ, పాదాలను మార్చివేసిన దుర్ఘటనలూ కోకొల్లలుగా కనిపిస్తాయి.

అటువంటప్పుడు శబరి ఎంగిలి ఫలాలను దైవ స్వరూపుడైన రాముడు భుజించడం అనేది అనౌచిత్యం. ఒక బోయ స్త్రీ ఉచ్ఛిష్టాన్ని రాముడు భుజించాడంటే, అతని పవిత్రతకు కళంకం వాటిల్లుతుంది. అనే ఛాందస భావం చోటు చేసుకొంటే ముద్రిత ప్రతుల్లో ఈలాటి పాఠ భేదం చేరటంలో అబ్బురపడవలసిన అవసరంలేదు. లిఖిత ప్రతులు కూడా పాఠ భేదాలతో ప్రత్యక్షమయ్యేవి అసంఖ్యాలు. లిఖిత ప్రతులను లిఖించుకొని తమవద్ద ఉంచుకొనేవారు సైతం తమ అభిరుచుల కనుగుణంగా వ్రాసి ఉంచుకొనటంచేత గూడ ఇటువంటి ప్రమాదాలు చోటు చేసుకోవడానికి అస్కారం ఉందని చెప్పవచ్చు. పాఠభేదాలను ప్రదర్శించడం నా లక్ష్యం కాదు. కనుక పాఠభేదాలను నేనిక్కడ ప్రదర్శించడం లేదు.

రాముని ఎంగిలి ఫలాలను శబరి తన ఆతిథ్యంలో అర్పించినట్లు వాల్మీకి రామాయణంలో కానీ, అధ్యాత్మ రామాయణంలో కానీ లేదనడం స్పష్టం. శబరి ఎంగిలి ఫలాలు రాముడు భుజించినట్లు ప్రపంచంలో ప్రబల ప్రచారం పొందిన మాట వాస్తవం. శబరి ఎంగిలి ఫలాలను రాముడారగించడంలో ఔచిత్యముందా! ఆరగించక పోవడంలో ఔచిత్యముందా! అనేది ఆలోచనీయాంశం.

శబరి ఆతిథ్యాన్ని గురించి శ్రీమాన్ నాడధూరు శఠకోపాచార్యులు అయ్యవార్లంగారి అభిప్రాయం ఈ క్రింది విధంగా ఉంది—

"శ్రీరామచంద్రుని నిమిత్తమై సేకరింపబడిన ఫలములను శ్రీరామ చంద్రుడు ప్రీతిలో స్వీకరించెను. "శబర్యాపూజిత స్సమ్యగ్రామో దశరథా త్మజః" అనియే యున్నది. శబరి కొరికిన పండ్లను తినెను. అని లోకమున వాడుకలో నున్నను, గ్రంథమున కానరాదు. మతంగ మహర్షి శిష్యురాలు ధర్మ చారిణి అట్టి పనిచేసి సమర్పించినది. అవి శ్రీరామచంద్రుడు స్వీకరించె ననుట హాస్యాస్పదము. మంచివి అగునో కాదోయని ఆ జాతి పండ్లలో లేనిచో కొన్ని టిని తాను ముందుగా భక్షించి చూసి సమర్పింపదగిన జాతి ఫలముల నిర్ధారణ చేసి సమర్పించి యుండవచ్చునే కాని తాను సగము పంటితో కొరకి రుచి చూసి మిగిలిన సగము సమర్పించినదనుట సమంజసముగా లేదు. వాల్మీకి రామాయ ణములో ఎక్కడ వెతికినను ఇందుకు ఆధారము లేదు.

"సంస్పృశన్నాసనం శౌరేః విదురస్స మహామతిః" అన్నట్లు దివ్య మంగళ విగ్రహ ప్రీత్యభినివేశముతో ఆ జాతి ఫలములు భోగ్యములగునో కావో యని రకమునకొక పండు ఆమె స్వీకరించి యుండుననుటలో సందేహ ముండదు. కానీ, కొరికి ఎంగిలి చేసిన ఫలములు ఇచ్చినదనుట స్వరూప స్వభావములకు సర్వదా విరుద్ధములు.

అయితే శ్రీ వచన భూషణమను తమిళ గ్రంథమున "పెరుమాళ్ శ్రీ శబరి కైయాలే అముద శెయుదరు శినార్" అను సూత్ర వ్యాఖ్యానమునందు తిరునారాయణపురం అయి స్వామి అను ఆచార్యులు "మున్బుతాన్ పరీక్షిత్తు ద్విజస్పర్శ ముళ్ళ తిత్తిత్త వత్తై తిరుప్ప వళత్తిలే కొడుక్క" అని సాయించిరి. అటుపై వారి తరువాత ఆచార్యులున్ను విశద వాక్చిఖామణి యను బిరుదు వహించిన మణవాళ మహామునులు అనువారు తమ వ్యాఖ్యానములో 'తన్ నావుక్కు ఇనితా ఇఱుందఫల మూలాదిగళ్ ఎల్లామ్" అని సాయించిరి. అందుకు అరుంబదమను వాఖ్యానము నందు-

ద్విజ స్పర్షమ్ = దంతస్పర్షమ్ ఇదు పెరుమాళ్ విషయత్తిల్ అత్యంత భక్తియాలే అవళ్ పరీక్షార్థమాక శైయితాళ్ పెరుమాళ్॥ తదుచ్ఛిష్టం సుపావనమ్ ఎన్గిరవిశేషశాస్త్ర త్తైకొండు అంకరిత్తే రాకయాలే విరోధమిల్లై' అని సాయించిరి. అదిన్నిగాక దిజస్పర్శమ్ పక్షి స్పర్శమాయ్ ఫలమాధుర్య పరీక్ష పక్షిముఖదంశ నా దీనయాగమాలే"

వత్సః ప్రసన్న వనేమధ్యశ్శకునిః ఫలశాతనే శ్రియశ్చరితి సంసర్గే శ్వామృగ గ్రహణేశుచిః ఎన్ను పక్షిముఖ స్మర్శమ్ ఫలత్తుకుకు శుచిత్య హేతు వాయతే విరోధమిల్లైయన్నుమ్ శొల్లువరఘళ్ అనికూడా ఉదహరించిరి.

"ఫలానిచ సుపక్వాని మూలాని మధురానిచస్వయ మాస్వాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్యచ పశ్చాన్నివేదయా మాస రాఘవాభ్యాం దృఢవ్రతా" అని యున్నది.

పండితులు భక్తాగ్రగణ్యులు ఎట్లు గ్రహించినను సరే సమ్యక్, సగుణ, సహభోజనములని మూడు తరగతులు - శబరివద్ద స్వీకరించినది సమ్యక్ భోజనము.

"విదురాన్నాని భుజేశచీనిగుణవంతిచ" అనునది సగుణ భోజనము.

"ఉపకారాయ సుగ్రీవోరాజ్యకాంక్షీ విభీషణః నిషారణాయ హనుమాన్ తత్తుల్యం సహజభోజనమ్" అనునది సహభోజనము. ఇవి అన్నియు శీలగుణ ప్రకాశములే సహజభోజనమనుదాని 'దృష్టాసీత' అని చెప్పినదానికి ప్రీతితో "సర్వస్వభూతస్తు పరిష్వంగో హనూమతః" అని సర్వస్వదానముక్రింద ఆలింగనపర్యాయముగా వ్యాఖ్యానము పూర్వాచార్యులచే చేయబడినది. భరద్వాజాశ్రమములో రావణవధా నంతరము ఆతిథ్యసమయంలో భరతుని వద్దకు రామాగమనవార్త చెప్పుటకు వెళ్ళిన హనుమంతుడు రాగా విందు జరుగుచున్నందున హనుమంతునకు స్థానం లేకపోయినందున శ్రీరామచంద్రుడు తాను భుజించుచున్న కదళీపత్రమందు రెండు భాగములగునట్లు మధ్యలో ఒక గీతగీసి యెదురుగా హనుమంతుడు ప్రీతుడై రామోచ్ఛిష్టమును ఆరగించెననిన్నీ, పై విదుర శబరులది మాత్రమే అర్థముకాదనిన్నీ ఆ నాటినుండియే అరటి ఆకుకు మధ్య ఒక గుర్తు ఏర్పడినదని పురాణాంతరము నందలి ఇతిహాసము. సాధారణముగ కదళీ పత్రములందు భుజించువారు పై భాగముకపి భాగమును వాడుకచే ముందు భాగమందే భుజింతురు.

శ్రీరామచంద్రునకు గుహుడు ఆతిథి సత్కారము చేసిసమస్తాహార పదార్థములను సమర్పించెను. కానీ శ్రీరామచంద్రుడు—

"అర్చితా శ్చైవహృష్టాశ్చ భవతాసర్వథావయమ......
......ఔపవాస్యంత దాకార్షీ ద్రాఘవస్య హసీతయా''

అని నిరాకరించెను, ఇచ్చటగుహసమర్పితమైనవి. భోగ్యానర్హములు శబరీ దత్తఫలములు స్వీకార యోగ్యములగుటను విచారణీయము. ఇరువురు నిషాద జాతివారు ఆటవికులు మీదుమిక్కిలి శబరి స్త్రీ. లోకములో అహితాగ్నులు, శిష్టులు పురుషపాకము తప్ప స్త్రీ పాకము అంగీకరింపరు. అట్టిచో శబరీ దత్తఫలములు స్వీకారయోగ్యములును, గుహదత్తాహారము స్వీకారనర్హములును! పైగా కారణము "నహినరౌ ప్రతిగ్రహీ" అనియు అశ్వములకు మాత్రము సంతృప్తి పరచిన చాలుననియు పలికెను. వేణుదగ్ధ కదళీకాండ న్యాయముచే జాతి, జన్మమే దైనను పరంపరాగమైన సద్గురు సమాశ్రమణీయ భాగ్యముచేత పరమ భాగవత జన్మసిద్ధించినచో అట్టివారి ద్రవ్యమే స్వీకరణ యోగ్యమని యిక్కడ నిర్ధారణ చేయబడినది. గుహునకు అట్టి పరంపరానుగత సద్గురు సమాశ్రయణ భాగ్యము కలిగి యుండలేదు. శబరి మతంగమహర్షి శిష్యురాలగు భాగ్యము కలిగినది. కనుకనే శబరీ దత్త ఫలములు స్వీకార యోగ్యమైనవి."10

అని శ్రీమాన్ నాడాధూరు శఠకోపాచార్యులు అయ్యవార్లంగారు శబరి ఆతిథ్య విషయంలో విపుల చర్చచేసి తమిళ సూత్రకారుల వ్యాఖ్యాతల అభిప్రాయాలను గూడ ఉదహరించి శబరి మతంగ మహర్షి శిష్యురాలయ్యే భాగ్యము కలిగింది కనుక శబరీదత్త ఫలాలు స్వీకార యోగ్యమైనవని పేర్కొన్నారు. వీరి అభిప్రాయం ఉచితమైన దనటమే సముచితము.

అయినా, శబరి రుచి చూచిన ఉచ్ఛిష్ట ఫలాలను రామునికి పెట్టడంలోనే ఆమె వాత్సల్య పూరిత భక్తికి పరాకాష్ఠత సిద్ధిస్తుంది.

రాముడు ఆమె ఎంగిలి ఫలాలను ప్రీతితో ఆరగించుటలోనే అతని భక్త వత్సలత పరాకాష్ఠత నందుకొంటుంది.

భగవంతునికి భక్తునియొక్క ప్రేమ యుక్తమైన భక్తి ప్రధానం. అట్టి భక్తులు ఎంగి ఫలాలను పెట్టినా! చింపిరి గుడ్డలో మూటగట్టిన చిరుతిండి పెట్టినా! పరమ ప్రేమాదర భావంతో భక్షించి వారి అభీష్టాన్ని తీర్చి వారికి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. కాబట్టి శ్రీరామునికి శబరి ఎంగిలి ఫలాలను సమర్పించడంలో కాని శ్రీరాము డారగించడంలో గానీ అనౌచిత్యం లేదని చెప్పడమే ఔచిత్యం.

# వాల్మీకి రామాయణం - అధ్యాత్మ రామాయణం - శబరి పాత్ర భేద సాదృశ్యాలు

వాల్మీకిరామాయణంలో శబరి పాత్ర అధ్యాత్మ రామాయణంలో శబరి పాత్ర కొన్ని సందర్భాలలో సాదృశ్యతను సంతరించుకొన్నా సంవిత్తులో ప్రవృత్తిలో కొంత భేదం కూడా దృశ్యమాన అవుతూంది.

**1. కబంధుని ప్రస్తావనలో :**

వాల్మీకి రామాయణంలో అధ్యాత్మ రామాయణంలో కూడా శబరిని గురించి ప్రథమంగా కబంధుడే ప్రస్తావిస్తాడు కాని ఈ ప్రస్తావించిన తీరులో భేదం కనిపిస్తుంది.

వాల్మీకి రామాయణంలో అరణ్యకాండ 73వ సర్గ 25వ 26వ శ్లోకాలలో శబరిని గురించి కబంధుడు ప్రస్తావిస్తాడు.

కబంధుడు రామలక్ష్మణులకు సుగ్రీవుడు ఉండే చోటికి మార్గాన్ని తెలియ చేస్తూ పంపాతీరాన్ని వర్ణిస్తాడు. మతంగ మహాముని ఆశ్రమ ఔన్నత్యాన్ని తెలియ చేస్తాడు. ఆ సందర్భంలోనే "మతంగ మహర్షికి ఉపచారం చేస్తూ ఉండిన పరిచారిణి శబరి అనే పేరుగల శ్రమణి చిరజీవిగ అచటఉంది. ఆమె నిన్ను దర్శించి స్వర్గానికి వెళుతుంది." అని తెలియచేస్తాడు.

అధ్యాత్మ రామాయణంలో కూడా అరణ్యకాండలో దశమ సర్గలో కబంధుడే శబరిని గురించి రామునికి తెలియ చేస్తాడు. కానీ కొంత భేదం కనిపిస్తుంది.

అధ్యాత్మ రామాయణంలో కబంధుడు మతంగా శ్రమ వర్ణన చేయడు. మతంగ మహర్షి ఔన్నత్యాన్ని ప్రస్తావించడు. పంపాతీర వర్ణన కూడా చేయడు.

శ్లో॥ లబ్ధ్వావరం సగంధర్వః ప్రయాస్సన్ రామమబ్రవీత్
శబర్యాస్తే పురోభాగే ఆశ్రమే రఘునందన॥11

ఇక్కడికి పురోభాగంలో శబరి యొక్క ఆశ్రమముంది. మీ రామెను కలుసుకోండి అని మాత్రం తెలియ చేస్తాడు, కాని సుగ్రీవుని గురించి ప్రస్తావించడు. వాల్మీకి రామాయణంలో సుగ్రీవుని గురించి విపులంగా తెలియ జేస్తాడు.

శ్లో॥ భక్త్యాత్త్వత్పాదకమలే భక్తిమార్గ విశారదా
తాం ప్రయాహి మహాభాగ సర్వం తే కథయిష్యతి॥[12]

ఆమె భక్తి మార్గాన్ని అవగతం చేసుకొన్న స్త్రీ. నీ పాదకమలాలను మనసులో నిలిపి ఉన్న మహాభక్తురాలు. మీ రామె దగ్గరికి వెళ్ళండి సీతాన్వేషణలో మీ కర్తవ్యాన్ని ఆమె చెబుతుంది. అని మాత్రం తెలియ చేస్తాడు.

వాల్మీకి రామాయణంలో కబంధునిచే పేర్కొ‌నబడిన శబరి పరిచారిణి, శ్రమణి, రామదర్శనార్థం నిరక్షిస్తున్న యోగిని.

అధ్యాత్మ రామాయణంలో కబంధునిచే పేర్కొనబడిన శబరి రాముని పద కమలాలు ఎదలో నిలిపిన భక్తిమార్గ విశారద. రామునికి సీతాన్వేషణ విషయంలో కర్తవ్యాన్ని చెప్పగల రామభక్తురాలు.

## 2. ఆశ్రమస్థల నిర్దేశం, రామలక్ష్మణులు ఆశ్రమానికి చేరిన కాలం

వాల్మీకి రామాయణంలో శబరి ఆశ్రమం పంపాతీరానికి పడమటి ఒడ్డున ఉన్నట్లు స్థలనిర్దేశం చేయబడింది. (ఇప్పటికిని బళ్ళారి జిల్లాలో పంపకు పడమటి తట్టున ఈ శబరి ఆశ్రమం కలదని అక్కడ బహు శీతలంగా ఉండునని శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు పేర్కొన్నారు.)

శ్లో॥ తౌ పుష్కరణ్యాః పంపాయా స్తీరమాసాద్యపశ్చిమమ్
అపశ్యతాం తత స్తత్ర శబర్యా రమ్యమాశ్రమమ్॥[13]

శబరి ఆశ్రమమం రమ్యమైందని అది పంపాసరస్సుకు పడమటి ఒడ్డున ఉందని వాల్మీకి రామాయణంలో చెప్పబడి ఉంది.

అధ్యాత్మ రామాయణంలో కబంధవనానికి పురోభాగాన శబరి ఆశ్రమం ఉందని చెప్పబడి ఉంది. రామలక్ష్మణులు కబంధుని దగ్గర నుండి వెళ్ళగానే శబరి ఆశ్రమానికి చేరుకొన్నట్లు అధ్యాత్మరామాయణంలో ఉండగా -

వాల్మీకి రామాయణంలో కబంధుని దగ్గరనుండి వెళ్ళిన రామలక్ష్మణులు ఋష్యమూక పర్వత ప్రాంతంలో రాత్రి నిద్రించి ఉదయం శబరి ఆశ్రమానికి వెళ్ళినట్లు చెప్పబడి ఉంది. రామునికి ఇక్కడినుండే శుభోదయం అవుతుంది. కనుక వాల్మీకి ఇలా సృష్టించాడని పిస్తుంది.

అధ్యాత్మ రామాయణంలో శబరి ఆశ్రమ స్థలనిర్ణయం కాని ఋష్యమూక పర్వత ప్రస్తావనకాని, రామలక్ష్మణులు శబరి ఆశ్రమం చేరిన కాలనిర్ణయంగాని స్పష్టంగా లేదు.

**3. అర్ఘ్యం - ఆతిథ్యం**

వాల్మీకి రామాయణంలో శబరి ఆశ్రమానికి రామలక్ష్మణులు చేరుకోగానే శబరి వారిని చూచి లేచి అంజలిఘటించి వారి పాదాలను తాకి శాస్త్రోక్తంగా పాద్య ఆచమనీయ ఆతిథ్యాదులయిన సకల విధోపచారాలు చేస్తుంది.

అధ్యాత్మ రామాయణంలో రామలక్ష్మణులు తన ఆశ్రమానికి రాగానే శబరి వారికి స్వాగతంచెప్పి తన ఆసనంపై కూచోబెట్టి పాదపూజ చేస్తుంది.

శ్లో॥ పతిత్వా పాదయోరగ్రే హర్షపూర్ణాశ్రులోచనా
స్వాగతే నాభినంద్యాథ స్వాసనే సంన్యవేశయత్"14

వాల్మీకి రామాయణంలో ఈ విధంగా హర్షపూర్ణాశ్రులోచనాలతో స్వాగతించడం తన ఆసనంపై కూర్చోబెట్టడములేవు. వాల్మీకి రామాయణంలో అర్ఘ్య పాద్యాదులయిన తరువాత శ్రీరాముడు శబరి ఆమె తపస్సును గురుశుశ్రూషను గురించి అడిగిన ప్రశ్నల పరంపర అధ్యాత్మ రామాయణంలో కనిపించదు.

శ్లో॥ తాముకవాచ తతో రామ శ్శ్రమణీం సంశితవ్రతామ్
కచ్చిత్తే నిర్జితావిఘ్నాః కచ్చిత్తే వర్ధతే తపః
కచ్చిత్తే నియతః క్రోధ ఆహారశ్చ తపోధనే
కచ్చిత్తే నియమాః ప్రాప్తాః కచ్చిత్తే మనస్సుఖమ్
కచ్చిత్తే గురుశుశ్రూషా సఫలా చారు భాషిణీ15

అరిషడ్వర్గసంబద్ధాత్మకా లయిన ఈ ప్రశ్నల పరంపర అధ్యాత్మరామాయణంలో లేవు. కాని రాముడు భక్తిని గురించి శబరికి చెప్పినట్లుంది.

వాల్మీకి రామాయణంలో శబరి పంపాతీరంలో లభించే వన్యఫలాలను రామలక్ష్మణుల కోసం సేకరించినట్లు చెబుతుంది. అధ్యాత్మ రామాయణంలో దివ్యమైనవి, అమృతంతో సమానమయినవి అయినట్టి సేకరించిన ఫలాలతో ఆతిథ్యం ఇచ్చినట్లు చెప్పబడింది.

వాల్మీకి రామాయణంలో శబరి ఆతిథ్యమిచ్చినట్లు సూచింపబడింది. అధ్యాత్మ రామాయణంలో ఫలాలను శబరి అర్పించినట్లు శ్రీరాముడు ఆరగించి నట్లు స్పష్టంగా చెప్పబడి ఉంది

## 4. గురుభక్తి ప్రకటన

వాల్మీకి రామాయణంలో శబరి రామలక్ష్మణులకు మతంగాశ్రమాన్ని చూపి వర్ణించి మతంగ మహర్షి మాహాత్మ్యాన్ని విశ్లేషణాత్మకంగా వివరించి తన ఆచార్యాభిమాన నిష్ఠను ప్రకటించుకొంటుంది. తన గురువుయొక్క పూజా వేదికను చూపుతుంది. వాడిపోని సుమమాలలను చూపుతుంది. తన గురువు మాహాత్మ్యంవల్ల అక్కడికి సప్తసాగరాలనూ, గంగాది పుణ్యనదులనూ చూపి తన గురువు గొప్పతనాన్ని చాటుతుంది.

అధ్యాత్మ రామాయణంలో శబరి తన గురువు ఆజ్ఞవల్ల వారికి స్వాగతం చెప్పడానికి తాను నిరీక్షిస్తున్నట్లు తన గురువుకు కూడా లభించని మీ దర్శన భాగ్యం నాకు లభించింది అని శ్రీరామచంద్రుణ్ణి స్తుతిచేస్తుంది. కానీ గురువు గొప్పతనాన్ని చెప్పినట్లు లేదు. "మీ దర్శనానంతరం నాకు మోక్షప్రాప్తి కలుగుతుందని మా గురువులు చెప్పారు. నేను అగ్నిలో ఈ శరీరాన్ని దహించి మోక్షానికి వెళతా" నంటుంది. కానీ వాల్మీకి రామాయణంలో శబరి నా గురువులు వెళ్ళిన లోకాలకు వెళతానని చివరిక్షణంలో కూడా గురుభక్తిని ప్రకటించు కొంటుంది.

## 5. రామస్తుతి

వాల్మీకి రామాయణంలో శబరి "ఓ రామా నీ దర్శనంవల్ల నా తపస్సు పరిపాకమైంది. సఫలమైంది. నా గురు సేవాఫలం ప్రాప్తించినట్లైంది. పురుష శ్రేష్ఠా, సాక్షాద్విష్ణు దేవా! శత్రు సంహారకా నీ దర్శనంవల్ల నాకు స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. నీ నిర్హేతుక కటాక్షంవల్ల పరిశుద్ధురాలనయ్యాను." అని శ్రీరాముని స్తోత్రం చేస్తుంది.

అధ్యాత్మ రామాయణంలో రామా నేను హీనజాతి సముద్భవను, నీ దాసానుదాసుల వారి పరంపర వందమంది గడచినను చివరివానికి కూడా దాసిగా ఉండడానికి అర్హతలేనిదాన్ని, అటువంటి దానికి ఏ కారణంచేతనో నీవు దర్శనమిచ్చావు."

శ్లో॥ "కథంరామాద్యమే దృష్టస్త్వం మనో వాగగోచరః
స్తోతుం నజానే దేవేశ కింకరోమి ప్రసీదమే॥"

అని తాను స్తుతించక పోయిననూ దయతో ప్రసన్నుడవై నన్నను గ్రహించమంటుంది.

వాల్మీకి రామాయణంలో తాను మూఢాత్మననీ హీనకులసంజాతనని గానీ, ఎక్కడా చెప్పుకోలేదు. అధ్యాత్మంలో తాను స్త్రీనని మూఢాత్మనని మాటి మాటికి నివేదించుకొంటుంది.

## 6. రామోపదేశం

వాల్మీకి రామాయణంలో రాముడు భక్తిని గురించి శబరికి ఉపయోగించినట్లు లేదు. కానీ ఆమె ఆహార నియమవ్రతాదుల గురించి మాత్ర. ప్రశ్నిస్తాడు.

అధ్యాత్మ రామాయణంలో రాముడు భక్తిని గురించి శబరికి దీర్ఘంగా బోధిస్తాడు. భగవంతుని భజించేవారికి జాతి, కుల, మత, లింగ భేదములు లెక్కకు రావని ఎవరైనా భక్తితో అర్చిస్తే భగవంతుడు అనుగ్రహిస్తాడనీ, భక్తి ప్రేమ స్వరూపమైనదనీ అది తొమ్మిది విధాలుగా ఉంటుందని బోధిస్తాడు. జ్ఞానోదయాన్ని గురించి ముక్తిని గురించి కూడా ఉపదేశిస్తాడు. అధ్యాత్మ తత్త్వాన్ని వివరిస్తాడు.

## 7. కర్తవ్యోపదేశం

వాల్మీకి రామాయణంలో రాముడు సీత జాడను గురించి అడగడం గానీ శబరి చెప్పడంగాని లేవు.

అధ్యాత్మ రామాయణంలో సీత జాడ గురించి శబరిని రాము డడుగుతాడు. శబరి సీతను రావణుడెత్తుక పోయాడని లంకలో ఉందని చెప్తుతుంది. సుగ్రీవునితో స్నేహం చేసుకొంటే మీ కార్యం సులభమై శుభం చేకూరుతుందని కూడా తెలియజేస్తుంది. ఈ విధంగా కర్తవ్యోపదేశం చేయడం మరే రామాయణాల్లో లేదు.

## 8. శబరి మోక్షం

వాల్మీకి రామాయణంలో శబరి రాముని అనుగ్రహాన్నీ, ఆజ్ఞనూ పొంది తన జీర్ణ దేహాన్ని అగ్నిలో దహించి దివ్యాంబరదివ్యమాల్యానులేపనాలు ధరించి దివ్య లోకాలకు వెళుతుంది. అంటె తన గురువు దగ్గరికి వెళుతుంది.

అధ్యాత్మ రామాయణంలో శబరి సుగ్రీవునితో చెలిమి చేసుకొమ్మని చెప్పిన తరువాత "రామా నీవు ఒక ముహూర్త మాత్రం నా ముందు నిలబడు నిన్ను చూస్తూ నేను ఈ దేహాన్ని దగ్ధం చేసుకొంటాను" అని చెప్పడం గమనార్హం. తన గురువులు పోయిన లోకానికి పోతాననే ప్రసక్తి ఇందులో లేదు.

ఈ విధంగా వాల్మీకి అధ్యాత్మ రామాయణాల్లోని శబరి పాత్ర చిత్రణలో భేద సాదృశ్యాలు కనిపిస్తున్నాయి. వాల్మీకి రామాయణంలో శబరి గంభీరంగా మతంగునివలన భక్తి తత్త్వం తెలుసుకొన్న దానివలె తన పాత్రను నిర్వహిస్తుంది. గురువు దగ్గరికి వెళ్ళడానికి దేహాన్ని దహించుకొంటుంది. అధ్యాత్మ రామాయణంలోని శబరి అప్పుడప్పుడు తన కులం గురించి, స్త్రీత్వాన్ని గురించి చెప్పుకొంటుంది. రాముని వద్దనుండి భక్తి తత్త్వాన్ని గ్రహించినదిగా వర్తిస్తుంది. రాముణ్ణి చూస్తూ దేహ త్యాగం చేస్తుంది.

వాల్మీకి రామాయణంలో శబరి శ్రమణిగా యోగసిద్ధి పొందిన వృద్ధగా, భక్త శిరోమణిగా, తపస్వినిగా ఉగ్రమైన వ్రతనిష్ఠ కలదిగా, తపోధనిగా, చారు భాషిణిగా పరిశుద్ధురాలుగా జ్ఞాన విషయంలో సదా అంతరంగురాలుగా కనిపిస్తుంది.

అధ్యాత్మ రామాయణంలో శబరి - భక్తిమార్గ విశారదగా, శ్రీరామ చంద్రునియందు అమేయమైన భక్తి కలిగినదిగా శ్రీరామునకు కర్తవ్యోపదేష్టగా, అధ్యాత్మ తత్త్వానికి ప్రతీకగా కనిపిస్తుంది.

శబరి పాత్ర ద్వారా వాల్మీకి శ్రీరాముని అప్రాకృత పురుషత్వాన్ని నిరూపించే ప్రయత్నం ధ్వని పూర్వకంగా నిరూపిస్తే అధ్యాత్మ రామాయణంలో శ్రీరాముడు భగవంతుడే అను విషయాన్ని శబరి పాత్ర ద్వారా వాచ్యంగా వ్యక్తీకరించడం జరిగింది.

# అధో జ్ఞాపికలు

## ద్వితీయ ప్రకరణం

1. అధ్యాత్మ రామాయణము, బాలకాండము, ప్రథమ సర్గ
2. I bid, అధ్యాత్మ రామాయణ మాహాత్మ్య శ్లోకాలు
3. I bid, అరణ్యకాండ, దశమ సర్గ, శ్లోకం - 2
4. I bid, ,, ,, శ్లోకం - 6
5. I bid, ,, ,, శ్లోకాలు - 8, 9, 10
6. వాల్మీకి రామాయణము, అరణ్యకాండ, శ్లోకం - 17
7. వావిలికొలను సుబ్బారావు, శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, మందర వ్యాఖ్యానము, అరణ్యకాండ, పుటలు - 685, 686. శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజము, అంగలకుదురు, తెనాలి.
8. I bid, అరణ్యకాండ - పుటలు - 690, 691
9. I bid, ,, - పుట - 691
10. శ్రీమాన్ నాడాధూరు శఠకోపాచార్యులు, అయ్యవార్లంగారు, శ్రీ రామాయణ సర్వస్వము, ప్రథమ భాగము, పుటలు - 19 - 20, నూజివీడు, కృష్ణాజిల్లా - 1973
11. అధ్యాత్మ రామాయణము, అరణ్యకాండ, దశమసర్గ శ్లోకం - 1
12. I bid, ,, ,, శ్లోకం - 2
13. వాల్మీకి రామాయణము, అరణ్యకాండ, సర్గ - 74, శ్లోకం - 4
14. అధ్యాత్మ రామాయణము, అరణ్యకాండ దశమ సర్గ శ్లోకం - 6
15. వాల్మీకి రామాయణము, అరణ్యకాండ సర్గ - 74, శ్లోకాలు 7-8-9
16. అధ్యాత్మ రామాయణము, అరణ్యకాండ దశమ సర్గ శ్లోకం - 19

# తృతీయ ప్రకరణం

## శ్రీమద్రామాయణకల్పవృక్షం - శబరి పాత్ర వైశిష్ట్య వైలక్షణ్యాలు

### కల్పవృక్షం ఒక శిల్ప వృక్షం

1. కల్పవృక్షం 2. హరి చందనం 3. పారిజాతం 4. సంతానం 5. మందారం.

అనే ఐదు దేవతా వృక్షాల్లో కల్పవృక్షానిదే అగ్రస్థానం. తెలుగులో వెలసిన రామాయణాల్లో శ్రీమద్రామాయణ కల్పవృక్షానికే అగ్రపీఠం. శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో ప్రదర్శితమైన వైదుష్యం అనల్పం. అనితర సాధ్యం. ఇది కల్పవృక్షమే కాదు శిల్ప వృక్షం.

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు విశ్వనాథవారి శిల్ప ప్రతిభను ప్రవచిస్తూ—

"విశ్వనాథ రామాయణమును గల్పవృక్షమన్నట్లే శిల్పవృక్షమనియు జెప్పనగును. కల్పవృక్ష మడిగెడి వారికిఁ గోరినదెల్ల నిచ్చును. కావ్యదృష్టితోఁ జదువువారికీ రామాయణము రస, రీతి, భావ, ధ్వని, చమత్కారములనువలె భక్తితో బఠించువారికి మోక్షము కరతలామలకము చేయును. శిల్ప దృష్టి కలవారి కిందలి కవితాంగము లన్నింట నుదాత్తమైన శిల్పరామణీయకము గోచరించును. ఈ శిల్పవృక్షమునకుఁ బద్యము లాకులు. రసములు ఫలపుష్పములు. ఖండములు కొమ్మలు. కథ కాండము. వీనినే కథాకథన శిల్పము రస పాత్ర పోషణ శిల్పము, రీతి శిల్పము అని పేర్కొందురు.[1]

శ్రీమద్రామాయణ కల్పవృక్షం భారతీయాత్మదర్శన దర్పణం. భారతీయ తత్త్వ సారాంశ రసంతో కల్పవృక్షాన్ని పెంచడం జరిగింది. అందులో ఏ కొమ్మను, ఏ రెమ్మను, ఏ చిగురును చూసినా భారతీయత దర్శితమగును.

డా॥ కోవెల సుప్రసన్నాచార్యులు కల్పవృక్ష తత్త్వాన్ని ఈ విధంగా వ్యక్తీకరించారు.

“అవిచ్ఛిన్నమైన తెలుగు కవితా సంప్రదాయాన్ని పరిపాలిస్తూ విశ్వనాథ ఈ యుగంలో తన రామాయణ కల్పవృక్షం ద్వారా భారతీయాత్మ దర్శనం చేసినాడు. కావ్యాన్ని ‘ఆత్మ నిత్యమ్మ’ని ప్రారంభించి యుద్ధకాండలో పురుషోత్తముడైన రాముడిలో పరమేశ్వరుణ్ణి దర్శించడంతో పూర్తిచేసినాడు. భారతీయుని జీవనం యొక్క ఉన్నతోన్నతమైన ఆదర్శాన్నీ లక్ష్యాన్నీ ఈ కావ్యంలో రసవన్మహనీయంగా వ్యాఖ్యానించాడు.[2]

వీరి అభిప్రాయం సత్య సమన్వితం.

రామాయణ కల్పవృక్షం ధర్మ బీజంతో అంకురించింది. సంప్రదాయ శాఖోపశాఖలతో విస్తరించింది. ఎవరే విధంగా దర్శిస్తే ఆ విధంగా దర్శనమిస్తుంది. కవితాపుష్పాలు నవరసఫలాలు పుష్కలంగా పుష్పించి ఫలించిన అమర కావ్యం శ్రీమద్రామాయణ కల్పవృక్షం. దానికదే సాటి.

శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని గురించి శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు-

“తెనుగులో పూర్వము భాస్కరాది రామాయణములున్నవి. ‘రామాయణ కల్పవృక్షం’ యొక్క ఎత్తుగడలేదు. తెనుగు సారస్వతములో ఇంతటి ప్రబంధము రామగాథా బంధురమైనది వేరొకటి లేదు.,[3] అనిన వీరిమాటలు సత్యసమ్మతంగా ఉన్నాయి.

విశ్వనాథ కావ్యకళాతపస్వి. ఆయన దృష్టి ఆయన సృష్టి అపూర్వం. శిల్పదృష్టితో చూస్తే శ్రీమద్రామాయణ కల్పవృక్షానిదే అగ్రతాంబూలం.

“పరంపరాగతంగా వస్తున్న రామకథా స్వరూప తత్త్వాలను సమన్వయం చేసి రసానుగుణంగా కవితావ్యాఖ్యాన రూపంగా రామయణాన్ని సంతరించారు విశ్వనాథ. కావ్యశాతత్త్వ దృష్టితోచూస్తే ఆంధ్రభాషలో వెలువడిన రామాయణాలన్నింటిలోనూ అగ్రతాంబూలం అందుకొనే మహాకావ్యం రామాయణ కల్పవృక్షం”.[4]

అని ప్రవచించిన డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి అభిప్రాయం వాస్తవ సహితం. వీరందరి అభిప్రాయానుసారం శ్రీమద్రామాయణ కల్పవృక్షం శిల్ప వృక్షంగా భారతీయాత్మ దర్శనదర్పణంగా, ధర్మసారంగా, సంప్రదాయ ఫల ప్రదంగా, రసరత్నాకరంగా మహాకావ్యంగా పేర్కొనవచ్చు.

**తెలుగు రామాయణాలు శబరిపాత్ర - రేఖామాత్ర పరిశీలన**

తెలుగులో రామాయణాలు వందలసంఖ్యలో వెలిశాయి. రామాయణకర్తలు శబరిపాత్ర చిత్రణను వాల్మీకి రామాయణాన్నీ, అధ్యాత్మ రామాయణాదులనూ, జనశ్రుతులనూ అనుసరించి సృజించినా కూడ తమభావాలకు ప్రతిరూపంగా, తమ అభిరుచుల కనుగుణంగా, తమ అభిమతాలకు అనుకూలంగా శబరిపాత్ర చిత్రణ చేశారు. అందులో విలక్షణతను ప్రదర్శించిన కొన్ని ముఖ్యమైన రామాయణాల్లోని శబరిపాత్రను గురించి మాత్రం సమీక్షణం చేస్తాను.

**1-భాస్కర రామాయణం :-** ఇది చంపూరామాయణాలలో మొదట రచింపబడింది. హుళిక్కి భాస్కరుడు, అతని పుత్రుడు మల్లికార్జునభట్టు, అతని మిత్రుడు అయ్యలార్యుడు, శిష్యుడు కుమార రుద్రదేవుడు అనే నలుగురి కవులచేత వ్రాయబడింది. పుత్రమిత్ర శిష్యులు కలసి రచించినా పెద్దవాడైన భాస్కరుని పేరు ఈ రామాయణానికి పెట్టబడింది. ఆ పేరుతోనే ఇదిప్రసిద్ధి పొందింది.

హుళిక్కి భాస్కరుడు అరణ్యకాండం పూర్తిగా యుద్ధకాండలో 1133 పద్యాలు రచించాడు. శబరి పాత్రచిత్రణ ఈతని చేతిమీదుగానే జరిగింది. భాస్కర రామాయణంలో శబరిపాత్ర వాల్మీకి రామాయణాన్ని అనుసరించి తీర్చిదిద్ద బడింది. పంపాతీర పశ్చిమ తీరాన శబరి ఆశ్రమం బహుకుసుమ ఫల భరిత తరు విలసిత మైనదిగా వర్ణించబడింది. శబరి ఆశ్రమానికి వచ్చిన రామలక్ష్మణులకు ఆమె అర్ఘ్యపాద్యాదులను సమర్పించింది.

చం॥ వివిధములైన వన్యములు వేడుక నే నొనగూర్చి మిమ్ము బ్రా
"భవముక బూజ చేయఁగను బ్రార్థన చేసెద మీరు దీని గా
రవమున స్వీకరింపుడన రాఘవుఁడా రమణీయ వన్యముల్
ప్రవిమల బుద్ధి జేకొని తపస్వినికా రాఘవుడిట్లనున్"5

అని శబరి రామలక్ష్మణులకు ఇచ్చిన ఆతిథ్యాన్ని గురించిన వస్తువు ఒక చంపక మాలలో చెప్పబడింది. ఇది వాల్మీకి రామాయణంలోని "మయాతు వివిధం వన్యం" అను శ్లోకానుసారం వ్రాయబడింది. ఎంగిలి ఫలాల ప్రసక్తి ఇందులో లేదు. కాని శబరి అనేక రకాల వన్య ఫలాలను వేడుకతో సేకరించింది. "ప్రాభవమున పూజచేయగ అనుటచేత రాముడు ప్రభువు అనే భావంతో పూజ చేయడం శబరి భావంగా ఊహించవచ్చు. ప్రభువు అనగా రాజు, విష్ణువు అను అర్థాలున్నాయి. ఇక్కడ శబరి సంబోధించిన 'ప్రభువు, విష్ణువు, రాజు అను రెండర్థాలకు సరిపడుతుంది. కాని శబరి విష్ణువు అనే భావంతోనే ఈ సంబోధన చేసింది అని గ్రహించాలి ఇది హుళిక్కి భాస్కరుడు ప్రయోగించిన ఒక శ్లేష చమత్కారం. శబరి సమర్పించినవి 'రమణీయ వన్యముల్'గా వర్ణింపబడింది. రాముడు వాటిని "ప్రవిమల బుద్ధితో" చేకొన్నాడని చెప్పబడి ఉంది. అంతేకాని శబరి పండ్ల రుచిని చూచి రామునికి అర్పించినట్లు లేదు. రమణీయమైన ఫలాలను ప్రవిమల బుద్ధితో చేకొనడం సందర్భోచితమైన ప్రయోగం. వాల్మీకి ప్రయోగించిన తపస్విని, అనే విశేషణిన్ని గ్రహించి ఈ పద్యంలో శబరికి సముచితంగా ప్రయోగింపబడి ఉంది. భాస్కర రామాయణంలో శబరి పాత్ర వాల్మీకి శబరి పాత్రకు ప్రతిబింబంగా కనిపిస్తుంది. భక్తిలో, గురువుపై గౌరవ భావప్రకటనలో అన్ని విషయాల్లో గూడ వాల్మీకి శబరి తత్త్వానికి హుళిక్కి భాస్కరుని శబరి తత్త్వానికి సాదృశమే గాని భేదం హుళిక్కి అనే చెప్పాలి.

**మొల్ల రామాయణం :-** దీనిని ఆతుకూరి మొల్ల రచించింది. రామకథ సంగ్రహంగా చెప్పినా సమగ్ర కావ్య లక్షణాలు ఇందులో పొందు పరచబడి ఉన్నాయి. మొల్ల రామాయణం లోని శబరి పాత్రపై అధ్యాత్మ రామాయణ ప్రభావం కనిపిస్తుంది.

మొల్ల మిక్కిలి వినయంగా తనకు నిఘంటు వ్యాకరణ అలంకారాది శాస్త్ర పాండిత్యం లేదని చెప్పుకొంది. కాని ఈమె రామాయణంలో అమోఘమైన పాండితిని ప్రదర్శించింది. ఈమె శబరిని "ఘనముక్తి వధూవిసలాకబరి శబరి" అని పేర్కొంది. ముక్తి కాంతా కబరీ విలాసంతో శబరిని రూపించడంలో ఈమె అలంకార పాండితి స్పష్టమవుతూంది. స్త్రీ స్వభావ సహజమైన ఉపమానాలను గ్రహించడంలో ఈమె నైపుణి వ్యక్తమవుతోంది.

కం. "చనిచని యెదటను రాముడు
గనుగొని మహీజనో్ గ్ర కలుషాద్రి మహా
శని రూపంబనదగు నా
ఘన ముక్తి వధూ విలాస కబరిన్ శబరిన్"6

శబరి భిక్షురాలు, సన్యాసిని అయిన వృద్ధురాలు. ముక్తికోసం నిరీక్షిస్తున్న సిద్ధురాలు. అందుకే మొల్ల సందర్భోచితంగా పాత్రోచితమైన ఉపమానాలతో శబరి పాత్రను చిత్రించింది.

శబరి కలుషాద్రికి మహాశనిరూపం వంటిదట. అనగా కలుషాల కొండకు ఆమె రూపం అశనిపాతం లాంటిదట. రూపంలో శబరి తత్త్వాన్ని ఆరోపించిన వైనం యిది. ఈ ఉపమానం శబరి అకలుషత్వాన్ని తెలియజేస్తుంది. భక్తులు కలుషాల పాలిట ఆశనిపాతాలలాంటి వారని మొల్ల వ్యక్తం చేసింది. ఇది మొల్ల భావనా బలాన్ని తెలియచేయడమే కాక శబరి తత్త్వాన్ని కూడా తెలియచేస్తుంది. శబరి తత్త్వాన్ని మొల్ల వాచ్యంగా కాకుండా ధ్వనిగర్భితంగా ఈ చిన్న కంద పద్యంలో చెప్పింది. శబరి ప్రవృత్తి వ్యక్తం కావడానికి ఈ అలంకారోక్తి ఎంతో దోహదం చేస్తుంది.

మొల్ల రామాయణంలో శబరి రామలక్ష్మణులకు సుగ్రీవునితో చెలిమి చేసుకొంటే మీ కార్యసాధన సులభతరమవుతుందని కర్తవ్యాన్ని గూడ బోధిస్తుంది. ఈ కర్తవ్యబోధ వాల్మీకి రామాయణంలో లేదు. అధ్యాత్మ రామాయణంలో ఉంది. కనుక ఇందలి శబరి పాత్ర చిత్రణపై అధ్యాత్మ రామాయణ ప్రభావం ఉందని పేర్కొనవచ్చు. శబరి మోక్షం గురించి ఇందులో చెప్పబడలేదు.

**అచ్చ తెలుగు రామాయణం :-** ఈ రామాయణాన్ని కూచిమంచి తిమ్మ కవి రచించాడు. ఇందులో అధ్యాత్మ రామాయణపు పోలికలు కనిపిస్తాయి.

కబంధుడు రామలక్ష్మణులకు శబరిని కలుసుకోండి అని చెప్పగా వారు వెళ్ళుతూంటారు. వారిని చూచి శబరి తన ఆశ్రమానికి తీసుకొని వెళ్ళుతుంది.

కం॥ తెలిపిన జనుచో ముందఱ
వలనుగ ఒక చెంచు తెఱవ వారల దనయి
మ్ములకుం దోడ్కొని చని దుం
పలుఁ బండులు చాల నొసగి బలితపు చెలమిన్॥

కం॥ ఒరిమికయు బత్తి యున్నదిఁ
గరమ లరఁగఁ బూజఁజెఁ గన్నియ యపుడా
గరువంపు చెఱచి దిండుల
నిరసత పదినూళ్లు దొరల నేసిన దొరలన్॥7

ఈ రామాయణంలో శబరికోసం వాడిన విశేషణాలు 'చెంచు తెఱవ' కన్నియ అనేవి. ఈ అచ్చ తెనుగు రామాయణంలో మాత్రం శబరిని కన్యగా పేర్కొనడం జరిగింది. ఇది మూలంలో లేని విషయం. వాల్మీకి రామాయణంలో గానీ, అధ్యాత్మ రామాయణంలో కానీ, శబరిని కన్య అని గానీ, శ్రీమతి అని గానీ పేర్కొనబడలేదు. విశ్వనాథ సత్యనారాయణ గారు మాత్రం శబరి దివ్యత్వాన్ని పొంది దివిలో విన్కలి దాటివెళ్ళిన తరువాత, ఈ మునిరాజు నాశ్రమ మహీస్థలి యింత విచిత్రమై చనెన్ శ్రీమతి, యైన ఈ శబరి సేవ మఱిన్మఱి చిత్రమై చనెను" అని శబరిని 'శ్రీమతి', అని పేర్కొన్నారు. రామాయణాలన్నీ ఆమె వృద్ధురాలుగా, సిద్ధురాలుగా పేర్కొన్నాయి. కూచిమంచి తిమ్మకవి వాడిన విశేషణాలలో ఆమె భక్తి తత్త్వాన్ని బయల్పరచేవి లేవు. కాని శబరి రామలక్ష్మణులకు దుంపలు పండ్లు చాల ఇచ్చిందని ఒరిమిక భక్తి కలిగిన మనస్సుతో పూజ చేసిందని చెప్పడం చేత భక్తురాలని భావించడానికి వీలుంది. శబరి రామలక్ష్మణులను సుగ్రీవుని కలుసుకొమ్మని అచ్చ తెలుగు రామాయణంలో చెప్పి పంపింది. ఇందులో కూడ శబరి మోక్ష విషయం చెప్పబడలేదు.

**కంబ రామాయణం:-** కంబకవి తమిళంలో వ్రాసిన రామాయణాన్ని శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి గారు చంపూకావ్యంగా స్వేచ్ఛానువాదం చేసారు. ఇందులో శబరి రామునికి జనని సమానురాలుగ, శాస్త్రరీతులు తెలిసిన జ్ఞానిగా పేర్కొబడింది. రాముడు శబరిని, జనని, అని రెండుమూడు సార్లు సంబోధిస్తాడు.

చం॥ "కని ముద మంది రాఘవుడు కల్లు పథిశ్రమ మెల్లద్రోచి నె
మ్మనమునఁదన్నుదాఁ దలచి మాన్య తపంబొనరించుచున్న వృ
ద్ధను శబరిన్ సమంచిత ముదంబున గాంచి మహాత్మురాల యో
జనని యనామయంబె ? యన సంభ్రమ హర్షములుల్ల సిల్లగన్"8

శబరి మాన్య తపస్సు చేస్తున్న వృద్ధగా, మహాత్మురాలుగా ఇందులో చిత్రించడం గమనింపవచ్చు. జననీ అనీ, మదంబ అనీ, అమ్మఅని రాముడు సంబోధిస్తాడు. వాల్మీకి రామాయణంలో అధ్యాత్మరామాయణాదుల్లో కూడా రాముడు శబరిని జనని అనడం కనబడదు. కాని, వాత్సల్యంతో శబరి శ్రీరాము నకు ఫలాలు మాత్రం దాచినట్లుంది. వాల్మీకాదులలోని ఈ వాత్సల్యం పుత్రునిపై తల్లికుండే వాత్సల్యం లాంటిదిగా ధ్వనింప చేయబడగా కంబరామాయణంలో ఈ ధ్వనినే వాచ్యంగా పేర్కొవడం జరిగింది.

శబరి రామునికి ఫలాలను సమర్పించే సన్నివేశంలో కూడ రాముణ్ణి భగ వంతుడని అతని కుక్షిలో లోకాలున్నాయనీ అతని కుక్షి నిండితే లోకాలన్నీ హర్షిస్తాయనీ వర్ణించబడింది. శబరి రామునికి పండ్లను కొరికి రుచి చూచి ఇచ్చినట్లు అనేక రామాయణాల్లో చిత్రింపబడగా దానిమీద వాదోపవాదాలు వచ్చాయి. కంబ రామాయణంలో శబరి పండ్లను త్రుంచి చూసి చవిగలవానినే రామునికి ఇస్తుంది. ఎంగిలి పండ్లు పెట్టింది అనే అపవాదును పోగొట్టడానికే ఈ విధంగా కవి చిత్రించాడని చెప్పవచ్చు. ఇందులో ఔచిత్యం గోచరిస్తుంది. శబరి పలుకులను విని రాముడు జ్ఞానసుధను గ్రహించాడని చెప్పబడి ఉండడడం చేత శబరి మహా జ్ఞానిగా భావించాలి. ఈ విశేషణం కూడా పాత్రౌన్నతిని తెలియ జేస్తుంది. శబరి తన యోగశక్తితో శాశ్వితమైన ముక్తి కోసం అశాశ్వితమైన శరీరాన్ని వదిలిందట. రామలక్ష్మణులు చోద్యంగా చూశారట. చాలా రామాయణాల్లో శబరి పాత్ర చిత్రణ కంటే కంబరామాయణంలోని శబరి పాత్ర చిత్రణ కొంత వైలక్షణ్యంతో కనిపిస్తుంది.

**తులసిదాసు రామాయణం :-** (రామచరిత మానసము) తులసీదాసు హిందీలో రాసిన రామాయణానికి అనువాదం. ఈ రామాయణంలో శబరి తన ఆశ్రమానికి వచ్చిన రామలక్ష్మణులకు పాదపూజచేసి సుందరాసనం మీద కూర్చో బెట్టినదట. అత్యంత రసయుతాలయిన ఫలాలను, కందమూలాలను రామునికి

పెట్టిందట. రాముడు ప్రేమమీర వాటిని ఆరగిస్తూ వాటి రుచిని మాటి మాటికి ప్రశంసిస్తూ ఆరగించాడట. రాముడారగిస్తూ ఉంటే శబరి ప్రేమతో నిలబడి చూస్తూందట. శబరి వాత్సల్య పూరిత ప్రేమను హృదయరంజకంగా చిత్రించిన వైనం ఇది.

ఈ రామాయణంలో శబరిపాత్ర చిత్రణలో వాల్మీకి రామాయణ ప్రభావం కంటే అధ్యాత్మ రామాయణ ప్రభావం అధికంగా కనిపిస్తుంది. అధ్యాత్మ రామాయణంలో చెప్పిన విధంగానే రాముడు శబరికి నవవిధ భక్తి విధానాలను గురించి వివరంగా తెలియచేస్తాడు. సీత జాడను గురించి శ్రీరాముడు శబరిని అడగడం కూడ అధ్యాత్మ రామాయణానుసారంగానే చిత్రింపబడింది. ఇందులో శబరి భక్తికి తోడు మిక్కిలి వినయవతిగా కనిపిస్తుంది. శబరి యోగాగ్నిలో తన శరీరాన్ని దహింపచేసుకొని శాశ్వితమైన సాయుజ్యాన్ని పొందిందని చెప్పబడి ఉండడం చేత విశిష్టాద్వైతానికి సన్నిహితంగా ఈ పాత్ర కనిపిస్తుంది. దీనిని దినవహి సత్య నారాయణ గారు తెలుగులోనికి అనువాదం చేశారు.

రామాయణాన్ని ద్విపదలో కూడ కొందరు కవులు రచించారు. అందులో మొట్టమొదట రచింపబడినదీ; మొట్టమొదట పేర్కొనదగినది కూడా రంగనాథ రామాయణమే. రంగనాథ రామాయణం అరణ్యకాండలో సుమారు 44 ద్విపదల్లో శబరి వృత్తాంతం చెప్పబడి ఉంది. శబరి రామునికి చేసిన సత్కారం హృద్యంగా వర్ణింపబడి ఉంది. ఇందులో వాల్మీకి రామాయణంలో అధ్యాత్మ రామాయణంలో చెప్పబడని విషయం ఒకటి చెప్పబడి ఉంది. రామలక్ష్మణులు శబరి ఆశ్రమంలో ఒక్కరాత్రి నివసించినారని చెప్పబడి ఉంది. ఇది ఇతర యే రామాయణాల్లోను కనబడదు.

"నీ వాద్యుడు సర్వనిగమ వేద్యుడవు
కావున నినునుతుల్ కావింపఁదరమే?
యిది మాతంగమునీంద్రు నాశ్రమము
విదిత తపశ్చర విశ్రాంతి కరము"
నని యా మహత్వంబులన్నియుఁ దెలిపి
వన మూలఫలములు వలనొప్ప దెచ్చి-
యిచ్చిన భుజియించి యెలమి మైరాము
డచ్చటఁ బ్రీతితో నారాత్రి నిలిచి"

అని చెప్పబడి ఉంది. ఇది యితరరామాయణాలలో లేని విశేషం. శబరి రాముని ఆద్యునిగా, నిగమవేద్యునిగాను నుతిస్తుంది. దీనివలన ఆమె అపూర్వమైన ఆధ్యాత్మికత్వం వెల్లడౌతోంది. రంగనాథ రామాయణ కర్తపై వాల్మీకి రామాయణ ప్రభావం అధికంగా కనిపిస్తుంది.

ఈ విధంగా తెలుగు రామాయణాల్లో శబరి పాత్ర చిత్రణపై భిన్న దృక్పథాలతో కొందరు చేస్తారు. కాని శబరి శ్రీరాముని భక్తురాలనే ఏకసూత్రం పైననే జరిగి ఉండటం కనిపిస్తుంది.

## కల్పవృక్షం - శబరిఖండ వైశిష్ట్యం

శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఆరుకాండలను ముప్పై ఖండాలుగా విభజించి దేశ, కాల, పాత్రల, సంఘటనల ప్రాముఖ్యాన్ననుసరించి పేర్లు పెట్టారు విశ్వనాథవారు. పూర్వ రామాయణకర్త లెవ్వరూ ఈ విధంగా ఖండాలుగ విభజించలేదు. ఇది విశ్వనాథ వారి నూత్న సృజన.

"తిక్కన భారతాన్ని ప్రబంధ మండలి అన్నట్లే కల్పవృక్షాన్ని" కమనీయ ఖండకావ్య మండలి అనవచ్చు[10] అని ప్రవచించారు డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారు.

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో ఒక్కొక్క కాండాన్ని ఐదేసిఖండాలుగ విభజించడం జరిగింది. ఆ విభజన ఇలా ఉంది.

**1. బాలకాండము :-** 1. ఇష్టిఖండము 2. అవతారఖండము 3. అహల్యా ఖండము 4. ధనుష్భంగ ఖండము 5. కల్యాణ ఖండము.

**2. అయోధ్యాకాండము :-** అభిషేక ఖండము 2. ప్రస్థాన ఖండము 3. మునిశాప ఖండము 4. పాదూఖండము 5. అనుసూయా ఖండము.

**3. అరణ్యకాండము :-** 1. దశవర్ష ఖండము. 2. పంచవటీ ఖండము 3. మారీచ ఖండము 4. జటాయుః ఖండము 5. శబరీ ఖండము.

**4. కిష్కింధకాండము :-** 1. నూపురఖండము 2. గజపుష్పి ఖండము 3. నియమపాలన ఖండము 4. సమీకరణ ఖంము 5. అన్వేషణ ఖండము.

**5. సుందరకాండము :-** 1. పూర్వరాత్ర ఖండము 2. పరరాత్ర ఖండము 3. ఉషఃఖండము 4. దివాఖండము 5. సంధ్యా ఖండము.

**6. యుద్ధకాండము :-** 1. సంశయ ఖండము 2. కుంభకర్ణ ఖండము 3. ఇంద్రజిత్ఖండము 4. నిస్సంశయ ఖండము 5. ఉపసంహార ఖండము.

ఈ ముప్పై ఖండాలలో స్త్రీ పాత్రల ప్రాముఖ్యానుసారం పేర్లు పెట్టిన ఖండాలు మూడు 1. అహల్య 2. అనసూయ 3. శబరి.

రామాయణంలో ఎందరో స్త్రీలున్నారు. కానీ వీరి ముగ్గురి పేర్లనుమాత్రం ఖండాలకు పెట్టడం గమనింపదగిన అంశం. ఈ ముప్పై ఖండాలలో పదిహేనవది శబరి ఖండం. అరణ్యకాండలో చివరిది.

అహల్య అపురూప సౌందర్యరాశి; రామునివలన శాపవిముక్తి పొందింది. "ఆరుగురు శ్రోతలైన మహాకృతియిది" అని అహల్యా ఖండాన్ని విశ్వనాథ వారు పేర్కొన్నారు.

అనుసూయ అత్రిమహాముని పత్ని. మహా పతివ్రత. అనుసూయా అత్రి మహామునులు సీతారాములను సాదరంగా తమ ఆశ్రమంలో సత్కరించారు. అనుసూయ సీతకు ఇగిరిపోని సుగంధాన్ని, నలిగిపోని చీరనూ, వాడిపోని సుమమాలనూ ఇచ్చింది. అనుసూయా ఖండం మోహనమైనదనీ దానిని విన్నవారికి "ఏది కోరితే అది సమకూర్చు సామీ" అని విశ్వనాథవారు అన్నారు.

శబరి మహాభక్తురాలు. పరమాత్మయే ప్రభువుగా భావించిన జీవాత్మ. శబరి కథ విన్నవారికి ముక్తి విభవం కలుగుతుందని విశ్వనాథ వారు పేర్కొన్నారు. ముక్తిఫల ప్రదమని శబరి ఖండాన్ని పేర్కొనడంలో ఈ ఖండ వైశిష్ట్యం వ్యక్తమవుతూంది. విశ్వనాథవారు పలికిన ప్రతి మాటలో ఏదో ఒక ధ్వనో ఒక అపూర్వార్థమో, అంతరార్థమో ఇమిడి ఉంటుంది. శబరిఖండంవింటే ముక్తివిభవం కలుగుతుందనడంలో ఇది భక్తిప్రధానమైన ఖండమనే భావం ధ్వనిస్తోంది.

శబరిఖండంలో చెప్పబడిన ఇతివృత్తం సంగ్రహంగా ఇలా ఉంది—

మాయలేడి కూతవిని సీతపంపున లక్ష్మణుడు రాముని సమీపిస్తాడు. లక్ష్మణుని చూడగానే రాముడు సీతకు కీడుమూడెనని శంకించి విలపిస్తాడు. వారు పర్ణశాలకు వచ్చి సీతజాడ తెలియక దుఃఖిస్తారు. పరిసర ప్రాంతాల్లో అన్వేషించి కానరాక సీతకోసం రాముడు పరిపరివిధాల పరితపిస్తాడు. సీతను రాక్షసులు భక్షించి ఉంటారని దుఃఖిస్తాడు. లక్ష్మణుడు ఓదారుస్తాడు.

జటాయువల్ల సీతను రావణుడపహరించాడని తెలుసుకుంటారు. జటాయువు దీనావస్థకు దుఃఖిస్తారు. జటాయువుతో రాముడు "నేను నీ కుమారుడను. దశరథునకు భరతుడే కుమారుడు అంటాడు. జటాయువుకు దహనసంస్కారం చేసి అతడు చెప్పినమార్గాన సీతనన్వేషిస్తూ వెళుతూ కబంధుని బాహుబంధంలో చిక్కుకొంటారు. అతని బాహుచ్ఛేదంచేసి శాపకారణం తెలుసుకొని అతనికి అగ్ని సంస్కారం చేస్తారు. అతడు వారికి సుగ్రీవుని విషయం తెలియజేస్తాడు. సుగ్రీవుని ఉనికికి దారితెలియజేస్తూ శబరి ప్రస్తావన చేస్తాడు. కబంధుడు గంధర్వుడై హంసయుక్తరథంలో వెళుతూ "రామా అని అతడూ, కబంధా యని వారు" స్నేహపూర్వకంగా చూసుకొంటారు. కబంధుడు తెలితార అయ్యేంత వరకు వారూ, వాళ్ళు తులసిమొక్క లయ్యేంతవరకూ కబంధుడూ చూచుకొంటారు. తులసి మొక్కలు పవిత్రతకు తెలితార శాశ్వతత్వానికి ప్రతీకలుగా తీసుకొని ఒక రమ్యభావాన్నేకాక అపూర్వ అంతరార్థాన్ని విశ్వనాథవారు ప్రదర్శించారు ఈ సందర్భంలో.

అటుపై వారు కబంధోక్త మార్గాన వెళుతూ శబరిని చూస్తారు.ఆమె వారికి వన్యఫలాలతో అతిథి సత్కారంచేసి ముక్తి పొందుతుంది. రామలక్ష్మణులు ఋష్యమూకంవైపు పయనించడంతో ఈ ఖండంలో కథ ముగుస్తుంది.

ఈ శబరి ఖండంలో 1. రామవిలాపం 2. కబంధుని శాపవిముక్తి 3. శబరి వృత్తాంతం అనే విషయా లున్నాయి. దీనికి రామవిలాపఖండమనో, కబంధ ఖండమనో పేరు పెట్టవచ్చు. కాని అలాచేయక శబరిఖండం అని పేరు పెట్ట డంలో కవిగారికి శబరి పాత్రపైగల అభిమానం వ్యక్తమవుతోంది.

సీతావియోగ దుఃఖసాగరాన్ని దాటడానికి ఈ శబరి ఖండం కావ్య నాయకుడైన శ్రీరామునికి వారధిలా ఉపకరిస్తుంది. సముద్రంమీద వానరులు సేతువు కట్టారు. సుగ్రీవుని స్నేహానికి కబంధుడు, శబరి వారధి కట్టారు. శ్రీ శ్రీరామునికి ఈ శబరి ఖండంనుండే శుభారంభమవుతుంది. ఈ ఖండం భావి కథార్థ సూచకంగా ఉంది. కబంధునివధ రావణసంహారాన్ని సూచిస్తుంది. శబరి ఆతిథ్యం రాముని పట్టాభిషేకాన్ని ధ్వనిస్తుంది. మహాభారతంలో విరాట పర్వంవంటిది ఈ శబరిఖండం అని నిర్వచింపవచ్చు.

## కల్పవృక్షం - శబరిపాత్ర వైలక్షణ్యం

అక్షరాలలో ధ్వనిని, పదాలలో చమత్కృతిని, పాత్రల్లో విలక్షణతను, కథల్లో సంప్రదాయసారాన్ని ప్రదర్శించడం విశ్వనాథవారికి వెన్నతో పెట్టినవిద్య.

ఎందరో కవులు రామాయణాన్ని రచించారు. తమ ప్రతిభా వ్యుత్పత్తులతో పాత్రపోషణ కావించారు. పాత్రచిత్రణ విషయంలో వాల్మీకి స్థాయినందుకొన్నవారు అరుదు. విశ్వనాథవారు మాత్రం వాల్మీకి దరిదాపులకు చేరుకోగలిగారు.

"రామాయణమొక మహాసముద్రము. అనంతజీవ సముదాయమునకందు ప్రవేశ సంచారములు కలవు. వాల్మీకి యందలి పాత్రల తీర్చిదిద్దిన తీరు నిరుపమానము. ఆ విషయమున నతని కీడురా జాలినవా రుండరు. విశ్వనాథ వారొక్కరందు కపవాదభూతులు. వారి పాత్రచిత్రణరీతి వివరించుట కొక గ్రంథము కాలయును. వారందలి ప్రతి పాత్రను స్పష్టరేఖలతో తీర్చిదిద్దిరి" అని ప్రవచించిన ఆచార్య దివాకర్లవారి మాటలు అక్షర సత్యాలు.

శబరి వంటి భక్తిప్రధానమైన పాత్రల చిత్రీకరణలో విశ్వనాథవారు తన ప్రగాఢమైన అధ్యాత్మ తత్త్వాన్నీ అమోఘమైన దైవభక్తినీ, ఆదరపాత్రమైన అద్వైతాభిమానాన్నీ అత్యంత ప్రతిభామహితంగా ప్రదర్శిస్తారు.

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో శబరి పాత్రను పరిశీలిస్తే విశ్వనాథ వారు ప్రత్యేక అభిమానంతో ఈ పాత్రను సృజించారా! అన్నంత వైశిష్ట్యం వైలక్షణ్యం కనిపిస్తుంది. ఈ శబరి పాత్ర అరణ్యకాండ చివర ప్రవేశపెట్టబడి ఉంది.

**కథా సందర్భం :-** కబంధుడు రామలక్ష్మణులకు సుగ్రీవుని వృత్తాంతాన్ని తెలియజేస్తూ "సుగ్రీవునిదైన క్షేత్రాన్ని అతని అన్న వాలి ఆక్రమించాడు. అతనికి నీవు ఉపకారం చేస్తే అతడు నీ కార్యసాధనకుపకరిస్తాడు. ఇతరులకు మనమెంత మేలుచేస్తే మనకంత మేలు కలుగుతుంది. అతడు పరమ కృతజ్ఞుడు. మాయలలో నక్రపులనెల్ల మించిన విశారదుడు. అతనితో చెల్మిచేసిన మీ కార్యం సిద్ధిస్తుంది." అని సుగ్రీవుడుండే ఋష్యమూకాద్రికి దారి తెలియచేస్తాడు.

వారు కబందోక్త మార్గంలో వెళ్ళుతూ పంపకు పడమటి తీరాన శీతల వాయువులకు ఉత్తరీయాలు కప్పుకొని ఊగుతూ నడుస్తూ ఉండగా వెనుక ఎవరో 'రామా' అని పిలిచినట్లైంది. తిరిగి చూస్తే ఎవరూ కనిపించలేదు. లక్ష్మణుడు మాత్రం ఇది శబరి పిలుపై ఉంటుందంటాడు. రామునికి శబరిని చూడాలనే కోర్కె మదిలో తారాడుతుంది. ఇక్కడ విశ్వనాథవారు ఆ ఆశ్రమ ప్రాంతమంతా రామనాదంతో ప్రతిధ్వనిస్తుంటూందనే భావాన్ని ధ్వనిగర్భితంగా చెప్పారు. రామునికి అలాంటి కోరిక కలుగగానే శబరి పూలు పండ్లు మంచి రుచి రంగుకలిగిన వాటిని మెట్టపళ్ళికలో పేర్చుకొని నాటకంలో సూత్రధారుడు ప్రస్తావన చేయగానే తెరముందుకు ప్రవేశించే పాత్రలా ప్రవేశిస్తుంది.

ఇక్కడ విశ్వనాథవారు శబరి ఆకారాన్ని తెలియచేయడానికి వాడిన ఉపమానం అమృతోపమానంగా ఉంది. సాధారణంగా ఋషులనూ సన్యాసులనూ వర్ణించేటప్పుడు అలంకారాలు అంతగా ఉపకరించవు. కాని అప్రతిమాన ప్రతిభావ్యుత్పత్తులుకల కవి దీనికతీతుడు. కాబట్టే విశ్వనాథవారుశబరి రూపాన్ని -

"తుట్టతుద దాఁక నెండిన చెట్టుకొమ్మ
శేఖరంబున యందుఁ బుష్పించినట్లు"[12]

అని అలంకారయుక్తంగా వర్ణించారు. శబరి మొయిలు వెల్గులు వోని పూలను, బంగారు రాగి కరిగిస్తే కలిగే రంగు కలిగి మాధుర్య సహితాలు రసానుకూలాలు అయిన ఫలాలను విడివిడిగా మెట్టపళ్ళికలో పేర్చుకొనివచ్చింది. అప్పుడామె

తుట్టతుద దాకా ఎండిన చెట్టుకొాన కొమ్మలో పుష్పించినట్లుందని ఉపమించడం ఎంతో సామరస్యంగా ఉంది. ఇది ఒక భావచిత్ర శిల్పం.

శబరి సిద్ధురాలయిన వృద్ధురాలు. ఆమె ఉపాసన ఉపవాసాదులతో బక్క చిక్కి ఎండి ఎక్కై ఉంది. ఎండిన చెట్టులా ఆమె కాయం ఉంది. కానీ, నెత్తిమీద పండ్లు పూలు ఉన్న పళ్ళెం ఉంది. అవి రంగు రుచి కలిగి ఉన్నాయి. అందుకే ఆమె ఎండిన చెట్టు చివరి కొమ్మలో పుష్పించిన విధంగా ఉందని ఉపమింప బడింది.

ఇందులో ఒక అంతరార్థం ఇమిడి ఉంది. శబరి రామాగమనం కోసం మోక్షేచ్ఛతో క్షణం ఒక యుగంగా నిరీక్షిస్తోంది. ఆ కోరిక ఇప్పుడు పుష్పించి ఫలించింది. ఆ పుష్పాలను ఆ ఫలాలను శిరస్సుపై పెట్టుకొని ఆమె ప్రవేశించింది. ఇందులో మరో పరమార్థం కూడ ఉంది. శబరి భక్తి పుష్పించి ఫలించింది అవే ఆమె శిరస్సుపై కనిపిస్తున్నాయని కవి ప్రతీకాత్మకంగా ధ్వనింపచేశాడు.

ఈ పాత్ర ప్రవేశం పఠితల మనో నేత్రాల ముందు విస్పష్ట రేఖలతో ప్రత్యక్షమవుతుంది ఈ దృశ్యాన్ని ఒక నిపుణుడైన చిత్రకారుడు రంగులు రంగలించి చిత్రించిన వర్ణచిత్రంవలె తీర్చిదిద్దారు విశ్వనాథవారు. ఇది సామాన్యు లకు అలవి కాని పని. మహా ప్రతిభావంతుడు మాత్రం ప్రదర్శించగల శిల్పం.

ఇలా ప్రవేశించిన శబరి కన్నుల్లో స్వామి తన ప్రతిబింబాన్ని చూచి విరహ బాధనంతా విడచినాడట. ఇది అత్యంత మనోహరమైన భావన. చిత్రకారుని కుంచెకు సైతం అందని చిత్రం.

సంభాషణలద్వారా పాత్ర సృజనచేయడం ఇతివృత్తాన్ని నడిపించడం ఒక గొప్ప కావ్య శిల్పం. ఈ శిల్పం అందరికి వశవర్తికాదు. ఆంధ్రవాఙ్మయంలో తిక్కన సోమయాజి, అల్లసాని పెద్దనాదులు ఏ కొందరో ఈ శిల్పాన్ని ప్రదర్శించి కృతకృత్యులయ్యారు. ఈ రకమైన శిల్పం విశ్వనాథవారి కనుసన్న లతో నర్తిస్తుంది.

శబరి పాత్ర ఆద్యంతం ఈ సంభాషణా శిల్పంతోనే నడుస్తుంది. తలపై పూలతట్ట దింపకనే సంభాషణ ప్రారంభిస్తుంది శబరి.

"తలపైఁ బూవుల తట్టదింపక యయోధ్యా వీథులనిన్ను నా
వలెఁగన్గొనగు వారలుందురె! యనం బ్రాణేశుడు ద్వేత్తున
వ్వుల నచ్చో నినువంటి వారుకలరా! బూఁబళ్ళికం డింపుకో
వలె నన్నన జిరునవ్వునన్, మఱచితిన్ స్వామీయటంచామె యున్ "12

రాముని అధ్యాత్మ తత్త్వాత్మికమైన హాసం హాస్యం ఇక్కడే మొదలవు తుంది. రామునితో శబరిఁ అయోధ్యా వీథులలో నావలె నిన్ను చూసేవాళ్ళుంటారా? అంటుంది. అనగా అయోధ్యలో ఎందరో రాముణ్ణి చూస్తారు కాని తనలాగా తన్మయత్వంతో చూసే వాళ్ళుంటారా? అని ధ్వని. పూలతట్ట దించకపోవటం ఆ ధ్వనికి ఉపపత్తి.

ప్రాణేశుడు ఉద్వేత్తు నవ్వులతో అక్కడ నీలాంటి వాళ్ళుంటారా? పూల తట్ట దించుకో, అంటాడు. శబరి చిరునవ్వుతో "మరచితిని స్వామీ అంటుంది. ప్రాణేశుడనే ప్రయోగం ఉద్వేత్తు నవ్వు ఈ శబరి నవ్వును ఆమె మధురభక్తిని ప్రతిపాదించడానికి నాందీగా గ్రహించవచ్చు.

శబరి "మరచితెన్ స్వామీ!" అనడం ఆమె తన్మయత్వానికి, పరవ శత్వానికి చిహ్నిక అనవచ్చు.

పాత్ర యొక్క చిరుచలనాన్ని కూడ కనులముందు కదలాడే విధంగా చిత్రించాలంటే కవి ఆ పాత్రలో లీనమైనప్పుడే అది సాధ్య మవుతుంది. అలా సృష్టించిన పాత్రలే సాహితీ జగత్తులో సజీవంగా నిలుస్తాయి.

శబరి పూలతట్ట దించగానే స్వామి మునివేళ్ళతో చరణయుగంపై పూలు చల్లుకుంటాడు." "అయ్యో స్వామీ! అంటూ దోసిళ్ళతో రాముని పాదాలమీద జల్లుతుంది. ఇక్కడ అయ్యో! స్వామీ, అనకుండానే పూలు చల్లవచ్చు. కాని ఆమె తన్మయత పరాకాష్ఠతకు చిహ్నంగా "అయ్యో స్వామి అనే మాటను విశ్వనాథవారు ప్రయోగించారు. పాత్రే తానై సృష్టించినప్పుడే తప్ప ఈలాంటి చిరు చలనాలను కూడా వర్ణించి రూపు కట్టించలేడు.

శబరి భక్తి ప్రధానమైన పాత్ర. భక్తికి తన్మయత్వం పరాకాష్ఠ. ఆ స్థాయిని శబరి చేరుకొంది అనే విషయాన్ని ధ్వనిగర్భితంగా చెప్పడమే ఈ "మరచితిన్ స్వామీ" అనడం. అయ్యో స్వామీ అనడమూను. ఇది కొండంత అర్థాన్ని గోరంత మాటలో ధ్వనింపచేసిన శిల్పం.

శబరి శ్రీరామునితో పలికిన ప్రతి పలుకులో ఆమె భక్తిశీల సంపత్తి ప్రదర్శిత మవుతుంది.

"నిన్ను చూసిన నాకు ఆకాశమును, సముద్రమును, వనములను చూసి నట్లైనది నీ ఆకారాన్ని చూసి విస్మయంచెందా నంటుంది. ఇది భగవంతుని విశ్వరూపాన్ని సందర్శించిన వారు అనగలిగే మాట. అనగా శ్రీరామునిలో విశ్వరూపాన్ని సందర్శించిందని ధ్వనింపచేయడం కవి ఉద్దేశ్యం.

రామునికి శబరి ఫలాలను రుచికరమైన వాటిని ఆరగించమని అర్పిస్తుంది. అప్పుడు రాముడంటాడు. "నన్ను నట్టవిలో నిలబెట్టి తినమంటే ఎట్లా? రామ రామ కాళ్ళు కడిగికోవలయును, కనులు తుడిచికోవలయును, స్నానము చేయ గానువలయు, అని. అందుకు శబరి అంటుంది. "ఇక్కడ ప్రతి చెట్టూ నాయిల్లే, నిత్య పవిత్రమూర్తివైన నీకు స్నానాదులా? చేతులుండడం చేత పూలు తెచ్చాను. చెట్లుండడంచేత పండ్లు తెచ్చాను. శరీరం ఉండడంచేత నడచివచ్చాను. మనస్సుండడం చేత ఊహించాను. అంతేగాని నేను పూలు తేలేదు. కొత్తగా నీవు ఇక్కడికి రాలేదు-" అని అద్వైత తత్త్వ సూత్రగర్భితంగా పలుకుతుంది. జీవాత్మ పరమాత్మలకు అభేదత్వం వ్యక్తం చేసిన సందర్భం ఇది.

పండ్లారగింపవే ప్రాణనాథ అంటుంది శబరి. నీవు తినిచూచి రుచికరము లయినవి ఏవో చెప్పకనే నేనెట్లు తినాలి అంటాడు స్వామి.

గీ. "స్వామి ప్రతివృక్షమందునఁ బ్రథమమందు
నేను రుచి చూచియే తెచ్చినాననంగ
శబరి, శ్రీరామచంద్రుఁడు నిబిడమంద
మృదు సుహాసుడు చూచె సౌమిత్రివంక"॥[14]

ఇక్కడ విశ్వనాథవారు ప్రదర్శించిన నేర్పు అనన్య సామాన్యమైనది. ఈ ఆతిథ్యాన్ని రామాయణ కర్తలు తలకొక తీరుగ వర్ణించారు శ్రీరామునికి ఎంగిలి ఫలాలు పెట్టిందన్న అపవాదు శబరికి, శబరి ఎంగిలి ఫలాలు భుజించాడన్న అపప్రథ రామునికి అంటగట్టారు. ఎన్నో వాదాలు వివాదాలు చేశారు వ్యాఖ్యా

తలు. విశ్వనాథవారు ఈ సన్నివేశాన్ని చాలా సున్నితంగా మలచారు. ప్రతి చెట్టులో ప్రథమమున నేను తినిచూసియే తెచ్చానని శబరిచేత చెప్పించడంలోనూ! "అట్లు రుచి చూడడంచేత నా కుక్షి నిండినది. ప్రాణనాథ ఇంక నాకు విరామం లేదు చాలా శ్రమపడినావు. ఈ ఫలాలను ఆరగించు అని చెప్పించడంచేతనూ ఈ సన్నివేశం అచ్చమైన తెలుగువారి ఆతిథ్యాన్ని స్ఫురింపచేస్తుంది. వాత్సల్యపూరిత మధుర భక్తికి ప్రతీకగా నిలుస్తుంది.

ఇక్కడ మరో చమత్కారం చేశారు విశ్వనాథవారు. ఫలాలను ప్రతి వృక్షంలో ప్రథమంగా రుచి చూచి తెచ్చానంటుంది శబరి. అప్పుడు శ్రీరామ చంద్రుడు నిబిడ మంద మృదు సుహాసుడు సౌమిత్రివంక చూస్తాడు. ఈ చూపుకు శబరి ఇంచుక సంచలిస్తుంది. "స్వామీ! చెడు చేత చేసితినా! అంటుంది- రాముడు "కాదు మరెట్లగున్ రుచింజూచుట అంటాడు - ఇక్కడ శ్లేషతో చమత్కారం చేసారు విశ్వనాథవారు. చెట్టులో రుచి చూడడం తప్పుకాక మరేమవుతుంది? అని ఒక అర్థం ఇది వ్యంగ్యార్థం. అట్లు తిని చూడకుండా ఉంటే రుచి ఎట్లు తెలుస్తుంది? అనేది వాచ్యార్థం. ఇక్కడ రాముని చూపుకుకూడా శ్లేషార్థాన్ని కలిగించాడు కవి. లక్ష్మణుని వైపు చూసిన ఆ చూపుకు లక్ష్మణునితో కలసి భుజించుదాము అనేది వాచ్యార్థం. లక్ష్మణా ఈమె చేసింది తప్పుకదా అనేది వ్యంగ్యార్థం. ఈ విధంగా చూపుల్లో కూడా శ్లేషార్థాలు ధ్వనింపచేసినవారు ఆంధ్ర సాహిత్యంలో అరుదు. శేష కావ్యాలు చెప్పడంకంటె చూపుల్లో శ్లేషార్థాలు ధ్వనింప చేయడం కష్టతరమైన శిల్పం. అర్థవంతమైన చూపులను చిత్రించిన వారిలో తిక్కన తరువాత విశ్వనాథ వారినే ఎన్నవలసి వస్తుంది. లక్ష్మణుడు తెచ్చిన నీటితో అంగుళీ ప్రక్షాళనం అధర సమ్మార్జనం చేసి శబరితో ఇట్లా అంటాడు.

గీ॥ "అవ్వ! నివ్వెర వెన్నెలయట్లు ముగ్గు
బుట్టవలె నయ్యెనీ శిరంబున ననంగ
బ్రభువ! నీయాత్మ వాకిట రంగవల్లి
నినుచుటకు నింతగాఁగ బండిన దటంచు"

అవ్వా! నీ శిరస్సు నివ్వెర వెన్నులలాగా ముగ్గుబుట్టలాగా అయింది కదా! అంటే "ప్రభూ నీ యాత్మ వాకిట రంగవల్లి వేయుటకు నా తల పండింది అంటుంది. ఇది భక్తి పండి పరిపక్వత చెందినవారు చెప్పే సమాధానం. భక్తులు సాత్వికులు, సత్త్వ గుణం తెలుపు శబరి భక్తి పండిన దనడానికి చిహ్నకగా ఆమె శిరస్సును నివ్వరి వెన్నులతో ముగ్గు బుట్టతో ఉపమించడం జరిగింది. అనగా ఆమె భక్తి పండింది. భక్తి పరిపక్వత చెందిన తరువాతి దశ భక్తుని ఆత్మ పరమాత్మ సన్నిధికి చేరుకోవడం అనేది. శబరి పరమాత్మ సన్నిధికి చేర సమాయత్తపడుతోందని ఈ పద్యంలో ధ్వనింప చేయడం జరిగింది. సాలోక్యము కల్గించమని అభ్యర్థించడం ఇందులో కనిపిస్తుంది.

గీ॥ "అవ్వ! యెంతో తపించి నీ యాయువెల్ల
నార్చి నీవిట్టు లెండి యేకైతి వనఁగ
ప్రభువః స్నేహంబు చేత నార్ద్రంబు చేసి
యింత దివ్వెగా వెలిగించవేయటంచు" 16

అవ్వా ఎంతో తపస్సు చేసి నీ ఆయుస్సునంతా అర్పించి ఈ విధంగా ఎండి ఏకైతివి గదా! అంటాడు రాముడు. ప్రభూ! నీ స్నేహంతో తడిచేసి చిన్న దివ్వెగా వెలిగించు అంటుంది శబరి. యోగసిద్ధి పొందినవారు కోరే కోరిక యిది. ఆత్మ అనే ఏకును పరమాత్మ తత్త్వంతో తడిచేసి వెలిగించమనడంలో పరమాత్మ జ్యోతి స్వరూపుడు. నాకుకూడ నీ సారూప్యం కల్పించు అని దీనిలోని ధ్వని ఇది సాలోక్యానికి తరువాతి దశ.

గీ॥ "అవ్వ! నీకిట్లు తీవ్రవ్రతాభిషంగ
మునను ప్రాణాలు గూళ్ళుపట్టిన వనంగ
ప్రభువ! నీయింత తీవ్రదయాభిషంగ
మునను ప్రాణమ్ము గూటఁజేరిన దటంచు" 17

"అవ్వా! నీవు తీవ్రమైన వ్రతాభిషంగంవల్ల ప్రాణాలు గూళ్ళుపట్టినాయి గదా! అని రాముడంటే- "నీ తీవ్రమైన దయాభిషంగంతో ప్రాణము గూటిలోకి చేరింది" అంటుంది. ఈ తీవ్రవ్రతాభిషంగమనే మాట వాల్మీకి సంశ్రితవ్రతా"

అన్నదానికి సమానార్థంలో వాడబడిన మాట. ఇక్కడ శబరి చెప్పిన మాట అధ్యాత్మ కోవిదులు పలికే మాటగ పరిగణించవలయును. నాకు సాముజ్యం కల్గించమనే ధ్వనిని గర్భీకరించుకొన్న మాటలు ఇవి. ఇది సారూప్యానికి తరువాతిదశ. సాయుజ్యం కల్గించమనడం.

ఈ సందర్భంలో ఆత్మ పరమాత్మ యొక్క సామీప్య సారూప్య సాయుజ్యాలను కలిగించమని ధ్వనిచేయబడింది. ఈ మూడు పద్యాలలోని అంతరార్థాన్ని డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు, ఇలా విశదీకరించారు.—

పైకి చూస్తే ఈ మాటలు ముగ్ధభక్తురాలి ముచ్చటైన పలుకులు. లోన చూస్తే భక్తితత్త్వాన్ని ప్రవచించే తేటగీతలు

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయా
మృత్యోర్మా అమృతంగమయ"

అనే జీవుని వేదనకివి త్రిశరణాల వంట కావ్యాలు. నీసేవ చేసుకొనే సన్మార్గంలో నడవనీ స్వామీ! నా బ్రతుకును వత్తిగా చేసికొని నీదివ్యజ్యోతిని వెలిగించుస్వామీ! నా ప్రాణాన్ని నీదివ్యాత్మ చైతన్యంలో లీనంచేసుకొని అద్వైతామృత పదాన్ని ప్రసాదించు స్వామీ! అని శబరి ప్రభువును వేడుకొన్నది. స్వామిప్రత్యక్షమైతే ప్రతిసాత్విక హృదయం స్పందించే విశ్వజనీనభావాంజలికి శబరి మాటలు స్వర్ణోదాహరణాలు"18

విశిష్టాద్వైతానికి భగవంతునిలో ఐక్యంకావడం చివరిదశ. అద్వైతానికి జీవాత్మ పరమాత్మలు ఏకతాభావం అఖరిస్తాయి. విశిష్టాద్వైత భావానికి అద్వైత తత్త్వానికి ప్రతీకగా ఈసందర్భాన్ని సృజించారు విశ్వనాథవారు.

తరువాత శ్రీరాముడు "నీ మాటలు ఊహచేస్తే సామాన్యార్థాలుకావు. నిర్భర దివ్యార్థాలయి కనబడు తున్నాయి. నీ పరమోదార ఫలానుభూతివల్ల శ్రమోప శమనం కలిగింది. నీవెవరు? అని అడుగుతాడు.

అందుకు శబరి నేనుమతంగ మహర్షి శిష్యురాలను. ఈవనభూమి ఆయనది. నాపేరు శ్రమణి" అని చెప్పుతుంది. మతంగమహర్షి మీకు స్వాగతం చెప్పడానికి

నన్ను ఇక్కడ నిలిపాడు వేదమూర్తి అయిన నిన్నుగురించి తెలియజేశాడు. ఇప్పుడు నీ పవిత్రమూర్తిని దర్శించి తరించాను.నా సేవకై ఆయన చూస్తుంటారు. కృపాసముద్రా! నన్ను అనుగ్రహించు. ఈ శరీరాన్ని అగ్నిలో వదలి వెళతాను. అని తన గురుతరమైన గురుభక్తిని ప్రకటించు కొంటుంది అప్పుడు శ్రీరాముడు-

ఆ॥ "అలఁతి యలఁతి నవ్వులారఁబోసిన కంటి
వెలుఁగు వెన్నెలలను బలికె స్వామి
నీకు మౌనిమీద నీమీఁదనాకును
వలపుఁ బొంతనములు పలువిధములు"19

తిక్కన అలతి అలతి దేశ్యపదాలలో అనల్పార్థాలు పలికించడంలో నైపుణ్యాన్ని ప్రదర్శిస్తే విశ్వనాథవారు అలతి అలతి నవ్వుల్లో కూడా అనల్పార్థాలను ప్రదర్శిస్తారు.

"నీకుమౌని మీద నీమీద నాకు వలపు పొంతనాలు పలువిధా" లంటాడు. ఇందులో భగవంతునికి భక్తుని మీద కంటే భాగవత భక్తునిమీద ప్రేమ మెండు అనే భావాన్ని వ్యంజింపచేశారు విశ్వనాథవారు. మతంగ మహర్షి భగవద్భక్తుడు శబరి మతంగుని ద్వారా భక్తురాలైంది. అనగా ఆమె భాగవత భక్తురాలు. భగవద్భక్తులకు సేవకులయిన వారు భాగవత భక్తులు అని అర్థం. అటువంటి భక్తుల మీదనే భగవంతునికి ప్రేమ యెక్కువ - అనే సత్యాన్ని ఈ సందర్భంలో వ్యంజింప చేయడం జరిగింది.

'వలపు పొంతనాలు' అనగా భక్తి తత్త్వాలు అని భావం. పరమమైన ప్రేమ భావమే భక్తి. కనుక విశ్వనాథ వారు వలపు పొంతనాలు అని ప్రయోగించారు. పలువిధాలు అంటే ఈ భక్తి అనేక రకాలు అనే భావం వ్యక్తం చేయబడిందిక్కడ. శబరి పాత్రద్వారా మధురాద్వైతాన్ని ప్రతిపాదింప దలచారు విశ్వనాథవారు. అందుకే వలుపు పొంతనాలు అనే ప్రయోగం చేశారు.

రాముడు ఇలా అడిగితే శబరి చెప్పిన సమాధానం కూడా అద్వైత పరంగానే వుంది.

ఆ. "శబరి యిట్టులనియె జలధికి గౌతమి
మీఁద నెంతొ శబరి మీదనంతె
జలధి రాజభర్త, శబరి లజ్జావతి
గోదవెనుక దాఁగి కొనియె పొందు" 20

సముద్రునికి గౌతమిమీద ఎంత ప్రేమో, శబరీ నదిమీద అంతే అంటే ఇక్కడ జలధి అనగా భగవంతుడు. గౌతమి అంటే మతంగ మహర్షి. శబరి అంటే ఆయన శిష్యురాలు శబరి. శబరి మతంగ మునిద్వారా భగవంతుని పొందింది. అనగా భగవంతునికి భక్తులంతా ఒక్కటే కాని భాగవత భక్తులు భగవద్భక్తుల ద్వారా భగవంతుణ్ణి పొందుతారు అని భావం. భగవంతునికి భక్తులందరూ తుల్యులే అని సాలంకారికంగా వ్యక్తం చేశారు విశ్వనాథ వారు.

అటు తరువాత శబరి మతంగాశ్రమ దృశ్యాలను గురువుగారి మహత్త్వాన్ని వర్ణించి చెబుతుంది. రామానుగ్రహాన్నీ అనుజ్ఞనూ పొంది తన జీర్ణ దేహాన్ని అగ్నిలో దహిస్తుంది. దివ్యరూపం దాల్చి దివ్యపదం పొందుతుంది.

ఒక అనిర్వచనీయమైన ఊహచేత దివ్యత్వం పొందిన శబరికి యోగిని అయిన శబరికి సామ్యం ఊహించవలసిందే. కానీ ఆమెకు ఈమెకు ఉద్దిలేదు అంటారు విశ్వనాథవారు.

ఈవిధంగా శబరిపాత్ర సృష్టిలో విశ్వనాథవారు అడుగడుగునా అధ్యాత్మ తత్త్వ రహస్యాలను శబరి శ్రీరాముల సంభాషణల్లో ధ్వనింపజేస్తూ ఇతివృత్తాన్ని నడిపించి నాటకీయతనూ తన సంభాషణా శిల్పాన్నీ ప్రదర్శించారు. అలతి అలతి మాటల్లో, దరహాసాల్లో, చూపుల్లో, చలనాలలో అనల్పార్థాలనే గాక అంతరార్థాలనూ, అపూర్వార్థాలనూ, నిక్షిప్తీకరించి వాల్మీకి రామాయణంలో కానీ అధ్యాత్మ రామాయణాది సంస్కృత రామాయణాలలో కానీ, తెలుగులో వెలసిన పూర్వ రామాయణాలలో గాని కనిపించని వైశిష్ట్యాన్నీ, వైలక్షణ్యాన్నీ శబరి పాత్రకు కల్పించి వాల్మీకి శబరి పాత్రకు వ్యాఖ్యానంగా రూపొందించారు విశ్వనాథవారు.

అద్వైత తత్త్వానికీ అందులో మధురాద్వైతానికీ ప్రతీకగా జీవుని వేదనకు కల్పించిన కళాకృతిగా శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో శబరిపాత్ర సృజన చేయబడింది.

# కల్పవృక్షం–శబరి భక్తితత్త్వం

కవులు, విమర్శకులు శబరి ముగ్ధ భక్తురాలని, ఆమెది వాత్సల్య భక్తి అని, సేవా భక్తి అని, శరణాగతి వలన ముక్తి పొందిందని విరచించారు నిర్వచించారు.

విశ్వనాథ సత్యనారాయణ గారు మాత్రం అసలు వాల్మీకి చిత్రించిన శబరి తత్త్వం ఇది కాదని, ఇలా విపులీకరించారు.

Sabari remains from the stand point of construction of the story simply as a releif to Rama, when he was so dispondent; The story of Sabari is unstreded in a hundred ways by a hundred people. All interpretations are different from what is written by Valmiki. As the attitude is of devotion developed in India a peculear change made its appearance. It has its source in "Samkhya philosophy. But it is defferent from Samkhya. In Samkhya the great Chaitanya is purusha and that wich is not purusha is prakriti wich is inanimate. But this new strain of devetion devides Chaitanya in to two. In the Dweaita philosophy, the lord is the lord. The other jivas are not one with the lord.

The lord is purusha, the ather jevas are women. If a soul or a community of souls pine for the lord all these souls are women and the lord is the man. The exotic sentiment is brought to play in this way. The Chaitanya school of the north the seed of wich

was soun in the south by some great Alwars has devo-loped a very peculiar philosophy of its own. Sabari seems to be the source for the kind of dilation in this divine exotic philosopy. Valmiki's text dose not war-rant this. Valmiki's Sabari is painted in light and shade. There is no difininiteness in Valmiki's Sabari. She was asked by Mathanga, the sage her guru, to wait for Rama more to play the host. She did it and there lift Rama to Might be a good or not. She did not expect salvation from Rama."[21]

ఇది విశ్వనాథ సత్యనారాయణగారికి శబరి పాత్రపై గల అభిప్రాయం. శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని స్త్రీ పాత్రలను శక్తి స్వరూపాలకు ప్రతీక లుగా విశ్వనాథవారు సృజించారని విమర్శకులు, అధ్యాత్మ తత్త్వజ్ఞలు తెలుపు తారు. శక్తి స్వరూపాలయిన సప్తమాతృకలలో శబరి ఒక మాతృకకు ప్రతీక అనవచ్చు. ప్రకృతి అంతా శక్తి స్వరూపం. ఈశక్తి స్త్రీమూర్తి. పరమాత్మది పురుష స్వరూపం. ప్రకృతికి పరమాత్మ భర్త. అనగా ప్రకృతిలోని ప్రతి జీవా త్మకు పరమాత్మ నాథుడు అను తత్త్వానికి శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని శబరిని లక్ష్యభూతంగా పేర్కొవచ్చు.

శబరి నాలుగు సందర్భాల్లో శ్రీరాముని "ప్రాణానాథా" అని సంబోధి స్తుంది. ఈ సన్నివేశాంలో జీవాత్మకు పరమాత్మ నాథుడనే అభిప్రాయంతోనే ప్రయోగించినట్లు భావించవచ్చు.

ఫలాల రుచి తెలిపే సందర్భంలో - "అలఋగస్త్యాది మహర్షుల వన ముల ఫలము లీ రుచికావు ప్రాణనాథ." అని

పండ్లారగించమని చెప్పే సందర్భంలో- "అంగీకరించిన నస్మ దా నీత ముల్ పండ్లారగింపవే 'ప్రాణనాథ'- అని రెండవసారి

రాముడు శబరితో నీవు నేను తమ్ముడు కలసి భుజించుదామా ఈ ఫలా లను తిన్నప్పుడు - శబరి నేను వాటిని సేకరించేటప్పుడు రుచిచూచిన వాటితోనే నాకుక్షినిండినది అంటూ- "ఫలప్రకరము కుక్షి నిండినది రామ! విరామము లేదు 'ప్రాణనాయక!"- అని మూడోసారి.

అగ్నిప్రవేశం చేసేటప్పుడు- "రఘుకులాంబుధి చంద్ర రాజీవ నేత్ర ! యఘ విదారణ శీల యానంద మూల 'నా ప్రాణనాథ" అని నాలుగో సారి సంబోధిస్తుంది శబరి. దీనిని బట్టి శబరి మధురా ద్వైత తత్త్వం తెలుస్తోంది.

గీ॥ "చేతులునికిని బూలు తెచ్చితిని స్వామి
చెట్లు కలవని పండ్ల తెచ్చితిని స్వామి
సతను వగుటను నేను వచ్చితిని స్వామి
చిత్తముండుట నూహ చేసితిని గాని" 22

అని అంటుంది శబరి. జీవాత్మకు ఒక ఆకృతి ఉంది కాబట్టి నేనీ పనులు చేశాను కాని, "నేను పూలుతేలేదు లీలామనోజ రాలేదు నేను నీవు క్రొత్తగా మాకొండిక చోటికి రాలేదు" అని అంటుంది. దీనిలో జీవాత్మకు పరమాత్మకు అభేదత్వం చెప్పబడింది.

రాముడు పరమాత్మ, శబరి జీవాత్మ. 'నాకు ఒక ఆకృతి ఉంది కనుక పూలు, పండ్లు తెచ్చాను; మనస్సుండటంచేత ఊహచేసాను. కాని, నేను పూలు తేలేదు, పండ్లు తేలేదు నీవు క్రొత్తగా నావద్దకు రాలేదు. నేను నీకు ఏమీ చేయ లేదు'- అని చెప్పడంలో 'సదానీవు నాలో ఉన్నావు నేను నీలో ఉన్నాను. అనగా జీవాత్మ పరమాత్మలకు భేదంలేదు' అను అద్వైత సూత్రాన్ని శబరి పాత్రతో ప్రదర్శించబడింది.

"బ్రహ్మసత్యం జగన్మిథ్యా, జీవోబ్రహ్మైవ, నాపరః" అనే ఉపనిష ద్వాక్యం అద్వైతానికి మూలాధారం. ఈ సూత్రానికి వ్యాఖ్యానంగా విశ్వనాథ వారి శబరి ఈ సందర్భంలో కనిపిస్తుంది.

శబరి అగ్నిప్రవేశం చేసింది. ఆకాశంలో ఆమె రూపాన్ని చూసి రాఘ వుడు-"ఒక యనిర్వచనీయమౌ నూహచేత ఆమెయే యీమె అని భావించును" "ఈ భావించడంలో - మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వ రమ్"- అను అద్వైత నిర్వచనానకి శబరి ప్రతిరూపంగా చిత్రింపబడిందని నిర్వచింపవచ్చు.

ఈ విధంగా విశ్వనాథవారి శబరి అద్వైతి అని చెప్పవచ్చు- వాల్మీకి రామాయణంలోని శబరిలో బీజ రూపంలో ఉన్న అద్వైతం అధ్యాత్మ రామాయ ణములో అంకురించింది. శ్రీ మద్రామాయణ కల్పవృక్షంలో పల్లవించి సుమించి ఫలించింది అని ప్రవచింపవచ్చు.

# అధోజ్ఞాపికలు

## తృతీయ ప్రకరణం

1. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, శ్రీమద్రామాయణ కల్పవృక్షము నందలి కవితా శిల్పము; స్రవంతి మాస పత్రిక, దక్షిణ భారత హిందీ ప్రచారక సభ, హైదరాబాద్ - 1959, ఏప్రిల్ సంచిక.
2. డా॥ కోవెల సుప్రసన్నాచార్యులు, నవకవిత తత్త్వ దర్శనం సాహిత్య వివేచన - పుట - 56.
3. డా॥ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, తెలుగులో రామాయణాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్-4.
4. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యము, రామాయణ కల్పవృక్షము, రామాయణ సుధాలహరి, పుట - 9, యువభారతి, సికిందరాబాద్-3.
5. భాస్కర రామాయణము, అరణ్యకాండము, ద్వితీయాశ్వాసము పుట 243, పద్యం 327, ఆంధ్రప్రదేశ్, సాహిత్య అకాడమి, హైదరాబాద్.
6. మొల్ల రామాయణము, అరణ్యకాండము, పద్యం-71 వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి - 1968.
7. కూచిమంచి తిమ్మకవి, అచ్చ తెలుగు రామాయణము, అరణ్యకాండ, పుట 45, పద్యాలు 120, 121, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి - 1954.
8. పూతలపట్టు శ్రీరాములరెడ్డి, కంబరామాయణము, అరణ్యకాండము, పుట 384, ప్రగతి ప్రచురణ, ఖైరతాబాద్, హైదరాబాద్-4.
9. రంగనాథ రామాయణము, ద్విపదకావ్యము, అరణ్యకాండము పుట 193, రాయలు అండుకో, కడప - 1957.
10. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యము, రామాయణ కల్పవృక్షము, రామాయణ సుధాలహరి, యువభారతి, సికిందరాబాద్ - 3

11. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ప్రతిభాలహరి. పుట - 107 యువ భారతి, సికింద్రాబాద్ - 3

12. విశ్వనాథ సత్యనారాయణ శ్రీమద్రామాయణ కల్పవృక్షము అరణ్యకాండ, పుట - 320 పద్యం 334, వల్లీ పబ్లికేషన్సు విజయవాడ - 4

13. Ibid - పుట 320 పద్యం 336

14. Ibid - పుట, 323, పద్యం - 348

15. Ibid - పుట, 324, పద్యం - 354

16. Ibid - ,, ,, పద్యం - 356

17. Ibid - ,, ,, పద్యం - 357

18. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యము, రామకథ సాయిసుధ, శ్రీ సత్యసాయి సేవా సమితి, హైదరాబాద్. 1982

19. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షము అరణ్యకాండ పుటలు-325, 326, పద్యం-363, వల్లీపబ్లికేషన్సు, విజయవాడ-4

20. Ibid - పుట - 326 - పద్యం - 364

21. Dr. Viswantha Sathyanarayana, Pages - 94 to 98 Maruthi Nager Vijayawada-4.

22. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామయణ కల్పవృక్షము అరణ్యకాండ పుట 321, పద్యం, 342, వల్లీ పబ్లికేషన్సు, విజయవాడ-4.

# చతుర్థ ప్రకరణం

## శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో శబరి పాత్రపై వాల్మీక్యాదుల ప్రభావం

### వాల్మీకి రామాయణ ప్రభావం

శ్రీమద్రామయణ కల్పవృక్షంలోని శబరిపాత్ర వాల్మీకి రామాయణంలోని శబరి పాత్రకు వ్యాఖ్యానరూపం.

వాల్మీకి విశేషణాలతో చెప్పిన శబరి తత్త్వాన్ని విశ్వనాథవారు ఆమె సంభాషణల్లో, చేతల్లో కదలికల్లో, కన్నుల్లో వ్యాఖ్యానించారు.

వాల్మీకి శబరిని "చారుభాషిణి'' అని పేర్కొంటే విశ్వనాథవారు శబరిని చారుభాషిణిగా సృజన చేశారు.

వాల్మీకి రామాయణంలో శబరి రామలక్ష్మణులకు పాదపూజాదులు చేసిన తరువాత రాముడామెతో "నీ తపస్సు, నీవ్రతములు సక్రమంగా జరుగుతున్నాయా?చారుభాషిణీ నీగురుపూజ సఫలమైందా? "కచ్చిత్తే గురుశుశ్రూషా సఫలా చారుభాషిణీ?'' అని అడుగుతాడు. అప్పుడు శబరి శ్రీరామునితో ఇలా అంటుంది-

శ్లో॥ "అద్యప్రాప్తా తపస్సిద్ధి స్తవ సందర్శనా న్మయా.
అద్య మే సఫలం తప్తం గురవశ్చ సుపూజితాః॥[1]

'నీ దర్శనం వలన నా తపస్సు ఇప్పుడే పరిపక్వం చెంది ఫలించినట్లయినది. నా గురుపూజ సఫలమైనది. అంటూ ప్రారంభించి నిన్ను పూజించడంవల్ల నాకు స్వర్గలోక ప్రాప్తి కలుగుతుంది. మా గురువులు స్వర్గలోకానికి వెళుతూ, మీ రిక్కడికి వస్తారని, మీకు ఆతిథ్యమియ్య వలసిందని, అట్లు చేస్తే నాకు పరమపద ప్రాప్తి కలుగుతుందని చెప్పిరి" నేను అప్పటినుండి పంపా

తీరంలో గల ఫలాలను సేకరించి దాచాను'- అని ఈ సందర్భంలో సంభాషిస్తుంది.

విశ్వనాథ వారి శబరి పూలు పండ్లుగల మెట్టపళ్ళిక నెత్తిమీద ఉంచుకొనే చారుభాషిణీత్వానకి తొలిపలుకులు పలుకుతుంది. "రామా అయోధ్యానగర వీథుల్లో నిన్ను నావలె చూచేవా రుంటారా?" అంటుంది. రాముడు "అక్కడ అసలు నీలాంటివారుంటారా? నెత్తిపైగల పూలతట్ట దించుకో" అని ఉవ్వెత్తు నవ్వులతో అంటాడు. శబరి చిరునవ్వుతో "మరచితిన్ స్వామీ!" అంటుంది. పూలతట్ట దించుతుంది. ఇక్కడ చిరుహాసం చేయకుండా, మరచితిన్ స్వామీ! అనకుండా కూడా మౌనంగా భక్తితో పూలతట్ట ఉంచుకోవచ్చు. కాని, అట్లు చేసిఉంటే ఆమె చారుభాషిణి కాదు కదా! ఆమెను చారుభాషిణిగా శిల్పీకరించడం కవి ఉద్దేశం కదా! అందుకే ఆమె చిరుహాసంతో మరతిచిన్ స్వామీ! అనింది. రాముడు ముని వేళ్ళతో పాదాలపై పూలు చల్లుకుంటాడు. అప్పుడు శబరి-

శా॥ "అయ్యో! స్వామి యటంచునున్ శబరి తానై దోసిళుల్ గాఁగఁబూ
లొయ్యన్ పాదములందుఁ జల్లి, కనులందుల్లోలకల్లోలమై
ముయ్యేరున్ జీలు రెండు వాగులుగ నంభోజాక్ష! నీ కోసమే
నయ్యా! తెచ్చితిఁ బండ్లటంచు నతిరుచ్యంబుల్ ప్రదర్శించుచున్॥[2]

శబరి దోసిళ్ళతో పూలు చల్లడం, కన్నుల్లో కల్లోలతను కనిపింప చేయడం 'అంభోజాక్షా! పండ్లు తెచ్చింది నీకోసమే నయ్యా!' అనడం ఇవన్నీ ఆమె భక్తితత్త్వాత్మకమైన చారుభాషిణీత్వానికి ఉపపత్తులనవచ్చు. వాల్మీకి రామాయణంలో ఇంత స్పష్టంగా ఆమె చేతలను భావాలను వర్ణించలేదు.

'ఆకాశాన్ని, సముద్రాన్ని, వనములను చూచి నట్లున్నది నీ రూపం' అని శబరి రామునితో అంటుంది, ఎదుటి వ్యక్తిని. ఉన్నతునిగా నుతించడం చారుభాషణంలో ఒక అంశం. కనుకనే శబరి రాముని ఔన్నత్యాన్ని స్తుతిస్తుంది.

అతిథితో సరసంగా మాట్లాడి సంతోషింపచేయడం అతిథిమర్యాదలో ప్రధానాంశం. అందుకే శబరి శ్రీరామునికి ఆతిథ్యం సమర్పించే సందర్భంలో శబరి శ్రీరామునితో తత్త్వార్థగర్భితంగా భాషిస్తుంది. ఈ సందర్భంలో శబరి

రాముణ్ణి "లీలామనోజ, చిత్తజన్మ ప్రాణనాథ, ప్రియాంగనా మహోయల్ల కానల ధూమదేహ, అని సంబోధిస్తుంది." చారు భాషిణులుకాక ఇలాంటి సంబోధనలు ఎవరు చేయగలరు. ఇంకా "ప్రాణనాయక శమంపడితివా ఫలముల్ తినవే దయామతీ"యని గూడ అంటుంది. ఇవన్నీ ఆమె చారు భాషిణీత్వానికి చిహ్నాలు.

వాల్మీకి శబరికి వాడిన విశేషణాలలో 'వృద్ధా' అనేది ఒకటి. దీనికి విశ్వనాథవారు అచ్చ తెనుగుతనాన్ని సంతరించి "అవ్వా" అని ప్రయోగించారు వాల్మీకి శబరిని రెండుసార్లు 'వృద్ధా' అని పేర్కొంటే విశ్వనాథ నాలుగు సార్లు "అవ్వా" అని శబరిని పేర్కొన్నారు. దీనినిబట్టి విశ్వనాథవారికి "అవ్వ" (శబ్దం) మీద ఎంత ఇష్టమో వ్యక్తమౌతోంది.

ఈ అవ్వ శబ్దం నన్నయ నాటినుండి గూడ కవులకు ఇష్టమైనదిగానే కనిపిస్తుంది. నన్నయ్య 'అవ్వ' శబ్దాన్ని పూజ్య స్త్రీ అనే అర్థంలో ప్రయోగించాడు. శ్రీ మహా భారతం ఆదిపర్వంలో—

భీముడు హిడింబాసురుని సంహరించిన సందర్భంలో అతని సోదరి హిడింబి భీమునికి కుంతికి మ్రొక్కిన సందర్భంలో కుంతిని "అవ్వా" అని సంబోధిస్తుంది.

శా॥ "అవ్వా! నా పలుకాలకింపఁగదే నీవత్యంతమున్ సృష్టిలో
నెవ్వారైనను బీడనొందెదరు కాదే కామపున్ రోగులై
పువ్వుంబోఁడుల కీజ్వరంబధికమై పొల్పొందుగా సృష్టిలో
బువ్వున్ విల్తుని బాణ సంచయమునన్ బూర్వంబు బాధించెడిన్"3

ఇది నన్నయ ప్రయోగం కాగా, బమ్మెర పోతనామాత్యుడు తల్లి అనే అర్థంలో "అవ్వ" శబ్దాన్ని ప్రయోగించినాడు.

కం॥ "వల్లవ గృహ నవనీతము
లెల్లను భక్షించి వచ్చి యెఱుగని భంగిన్
దల్లి గదిసి చట్టాడుచు
నల్లన చను బువ్వ బెట్టు మవ్వా యనుచున్"4

అని గోపాల కృష్ణుని బాల్యం వర్ణించే సందర్భంలో ప్రయోగించాడు మాతా మహి, పితామహి అనే అర్థంలో ధరణి దేవుల రామయామాత్యుడు తన దశావతార చరిత్రలో—

సీ॥ "అవ్వయంచును ప్రేమ నివ్వటిల్లగజేరి
మురిపెంపు మనుమడు ముద్దుగురియ"5

అని ప్రయోగించాడు. తరిగొండ వేంకమాంబ వృద్ధ స్త్రీ అనే అర్థంలో ప్రయోగించింది.

"అవ్వ ఇవ్విధంబున వంగి లేచుచున్"6

ఇంకా సామెతల్లో గూడా అవ్వ శబ్దం కనిపిస్తుంది—

"అవ్వాకావాలి బువ్వాకావాలి" అవ్వా గుబ్బు ఒకటే అయినవి.

విశ్వనాథవారు శబరిని శ్రీరాముడు పండ్లారగించిన తరువాత 'అవ్వా' యని సంబోధించినట్లు చిత్రించారు. ఈ సందర్భంలో శ్రీరామునికి శబరికి అధ్యాత్మ తత్త్వధ్వని ప్రధానమైన సంభాషణ జరుగుతుంది.అప్పుడు శ్రీరాముడు శబరితో—

"అవ్వ!'' నివ్వరి వెన్నులయట్లు ముగ్గుబుట్టవలెనయ్యె నీ శిరంబు' అని ఒకసారి, అవ్వ! యెంతో తపించి నీయాయువెల్ల నార్చి నీవిట్టు లెండి యేకైతివి, అని మరోసారి "అవ్వ!'' నీకిట్లు తీవ్రవ్రతాభిషంగమునను ప్రాణాలు గూళ్ళు పట్టినవిగదా' అని ఇంకోసారి, నీమాటలు ఊహచేస్తే సామాన్యార్థాలు కావు, నిర్భర దివ్యార్థాలయి కనిపిస్తాయి "అవ్వా'' ఎవ్వరేనీవు? అని సంబోధిస్తాడు. ఈ విధంగా విశ్వనాథవారు వాల్మీకి "వృద్ధ'' అని శబరికి వాడిన విశేషణాన్ని అవ్వా అని పలుమార్లు ప్రయోగించి "అవ్వ'' మీదగల తన అభిమానాన్ని ప్రకటించుకొన్నారు.

శ్లో॥ "తేషా మద్యాపి తత్రైవ దృశ్యతే పరిచారిణీ
శ్రమణీ శబరీ నామ కాకుత్స్థ చిరజీవినీ॥7

అని వాల్మీకి శబరిని "శ్రమణీ'' అని ఈ శ్లోకంలో పేర్కొన్నాడు. శ్రమణీ అనే పదానికి సన్యాసినిని, యోగినిని, భక్తురాలు, మనోజ్ఞురాలు అనే నైఘంటి కార్థాలను శబరిలో పొందుపరిచి వాల్మీకి శ్రమణికి వ్యాఖ్యానరూపంగా శబరి పాత్ర సృజన చేశారు విశ్వనాథవారు.

వాల్మీకి రామాయణంలో శబరి తాను మతంగ మహర్షికి శిష్యురాలనని ఆయన సేవ చేసేదాన్ని అనిమాత్రం చెప్పుకొంటుంది. ఏలాంటి సేవ చేసేదో చెప్పదు. శబరిచేసే సేవ ఏలాంటిదో విశ్వనాథవారిలా వ్యాఖ్యానించారు.

సీ॥ "ఫల మిత్పుష్ప సంభారంబు వేళకుఁ
దెచ్చి యందిచ్చెడు దిక్కు లేక
విరిసిన గుడ్డ తామరతూఁ టదారాన
నతుకు వెట్టి యొసంగు నాశ లేక
మొగుడు కన్నులఁ బొగపోయి యగ్నుల నూది
వెలయించి పెట్టెడు వెనుక లేక
యింద్ర రథంబుపై నేఁగిన యుత్తరా
యణ మార్గదూర పర్యంతగామి.

గీ॥ ఆ మహాస్వామి యచ్చట నటమటించు
నో, త్వదాజ్ఞా విలంబన మోర్వలేను
సిద్ధముగ నున్న యగ్నిలోఁ జేర్చిమేను
చనియెదను, నన్నను గ్రహించవె! కృపాళు."8

అని తన గురుసేవ యెటువంటిదో వ్యాఖ్యానిస్తుది. చారుభాషిణి అయిన శబరి.

వాల్మీకి శబరికి వాడిన విశేషణాలు - సిద్ధా, శ్రమణీ సంశ్రితవ్రతా, తపోధని, చారుభాషిణి, పరిచారిణీ, వృద్ధా మొదలయినవి. ఈ విశేషణాలన్నిటిని విశ్వనాథవారు శబరి వర్తనాగత సంభాషణాగత వాఖ్యానరూపంలో పొందు పరచారు.

విశ్వనాథవారు శబరికి వాడిన - వలిమేని ప్రన్ననగు ముడతల శబరి, పరిచారికా స్వభావ, ఆనందమతీ, మతిసుందరి, అవ్వా, శ్రమణి మొదలయిన విశేషణాలపై వాల్మీకి ప్రభావం కనిపిస్తుంది.

వాల్మీకి వాడిన విశేషణాలన్నిటికంటే చారుభాషిణి అన్న విశేషణానికి విశ్వనాథవారు అధిక ప్రాముఖ్యం ఇచ్చి శబరి కథాగతిలో ప్రవేశించింది. మొదలు అగ్నిప్రవేశం చేసేవరకు అడుగడుగునా అలతి అలతి సంభాషణలతో తనదైన నాటకీయ శైలితో శబరి చారుభాషిణీత్వానికి జీవంపోసి సృజించారు. కాబట్టి విశ్వనాథవారి శబరిని చారుభాషిణి అనవచ్చు.

వాల్మీకి రామాయణంలో శబరి భక్తితత్త్వాన్ని విశేషణాల ద్వారా వ్యక్తీకరిస్తే విశ్వనాథ సంభాషణా శిల్పంతో వ్యాఖ్యానించారు.

## అధ్యాత్మ రామాయణ ప్రభావం

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని శబరి పాత్రపై వాల్మీకి రామాయణ ప్రభావం అధికంగా కనిపించినా అధ్యాత్మ రామాయణ ప్రభావం కూడా రేఖా మాత్రంగా కనిపిస్తుంది.

అధ్యాత్మ రామాయణంలో శబరి రామలక్ష్మణులకు హర్ష పూర్ణాశ్రులోచనాలతో స్వాగతం చెపుతుంది.

శ్లో॥ "పతిత్వా పాదయోరగ్రే హర్ష పూర్ణాశ్రులోచనా
స్వాగతే నాభినంద్యాథ స్వాసనే సంన్య వేశయత్"10

అనే శ్లోక ప్రభావం విశ్వనాథవారి శబరి పాత్రపై కనిపిస్తుంది.

గీ॥ "మావనానకు హీరేంద్ర మణులు మీర
లన్నదమ్ములు వత్తురంచాడి, మౌని
మీకు స్వాగతి నెఱపుట నాకు నప్పఁ
జెప్పి, తన వెంట రమ్మని చెప్పెమౌని" 11

ఈ పద్యంలోని 'స్వాగతం, మీద అధ్యాత్మరామాయణంలోని పై శ్లోక ప్రభావం కనిపిస్తుంది. వాల్మీకి రామాయణంలో ఈ స్వాగతం కనిపించదు. పై శ్లోకంలోని హర్ష పూర్ణాశ్రులోచనాల ప్రభావం - కల్పవృక్షంలో శబరి పుష్పాలు ఫలాలు పల్లికలో పేర్చుకొని తలపై పెట్టుకొని మెల్లగ వస్తుంది-

గీ॥ 'శబరి కనులయందు స్వామి తాఁదన ప్రతి
బింబ మరసి దారవిరహ మూర్తి
విరహ బాధయెల్ల విడచెను, గంటినీ
రార శబరి కనులు తేరుకొనియె॥[12]

ఇందులోని కంటినీరార శబరి తేరుకొన్నదృశ్యం "హర్ష పూర్ణాశ్రులోచ నాలకు సాదృశ్యము."

శబరి కనులయందు స్వామి తన ప్రతిబింబాన్ని చూడడం అపూర్వ భావనాచిత్రం. కవిప్రతిభకు చిహ్నం-

పైరెండు సందర్భాలలో అధ్యాత్మరామాయణంలోని స్వాగత శ్లోక ప్రభావం కనిపిస్తుంది రేఖామాత్రంగా-

పుష్పాలతో పాదపూజ చేసినట్లు వాల్మీకి రామాయణంలో లేదు. అధ్యాత్మ రామాయణంలో సుగంధముక్తాలయిన సుమాలతో శబరి పాదపూజ చేసినట్లుంది.

శ్లో॥ 'ఫలాన్యమృత కల్పాని దదౌ రామాయ భక్తితః
పాదౌ సంపూజ్య కుసుమైః సుగంధైః సామలేపనైః॥ 13

విశ్వనాథవారు లేపనాలను తొలగించి పూలను పండ్లను హృద్యంగా వర్ణి చారు.

సీ॥ 'కడుపులో మెఱపులుగల పరించిన నిట్ల
మొయిలు వెల్గులువోని పూలుకొన్ని
బంగారమును రాగి పాళ్ళుగాఁ గరఁగించు
వన్నెయై యున్నట్టి పండ్లు కొన్ని
కొన్నిపూవులు లేఁత జన్నెయావు పొదుగు
వలె గర్భమంధరోజ్జ్వల మధువులు
కొన్నిపండ్లు రసానుకూల వాంఛాపరీ
పాక ముగ్ధాకార వర్తులములు"[14]

అని విశ్వనాథ వారు పూలను పండ్లను రమ్యంగా వర్ణించి రూపు కట్టించారు. ఈ వర్ణనపై అధ్యాత్మరామాయణ శ్లోక ప్రభావం లీలగా కనిపిస్తుంది. శబరి

రాముని పాదాలపై పూలను దోసిళ్ళతో చల్లడం మీద కూడ అధ్యాత్మరామాయణ ప్రభావమే కనిపిస్తుంది.

వాల్మీకి రామాయణంలో ఫలాల రంగు రుచి, పూలు కనిపించవు. అధ్యాత్మ రామాయణంలో సువాసనాభరితాలయిన కుసుమాలు అమృతంతో సమానమైన ఫలాలు కనిపిస్తాయి. శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని పుష్పాల్లో మెఱుపుల్లాంటి రంగులు, మధువులు, కనిపిస్తాయి. పండ్లకు బంగారు రాగి పాళ్ళుగా కరిగిస్తే కలిగే రంగు, రసానుకూల వాంఛా పరీపాక ముగ్ధాకార వర్తులములైన ఆకృతి కనిపిస్తుంది. మరి ఇవి కల్పవృక్షంలో పుష్పాలు ఫలాలు కదా! ఎవరు ఎలా దర్శిస్తే అలా కనిపించాలి కదా? ఎవరు ఎలాంటి రసాన్ని కోరితే అలాంటి రసాన్ని అందించాలి కదా! అందుకే అవి మనోజ్ఞమైన రూపుదాల్చాయి.

పై రెండు మూడు సందర్భాలలో మాత్రం అధ్యాత్మ రామాయణ ప్రభావం శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని శబరి పాత్రపై రేఖా మాత్రంగా కనిపిస్తుంది.

## తెలుగు రామాయణాలు - ప్రభావం

తెలుగులో అసంఖ్యాకంగా రామాయణాలు వెలసినా విశ్వనాథ వారి మీద వాటి ప్రభావం చాల తక్కువ. శ్రీమద్రామాయణ కల్ప వృక్షంలోని శబరి పాత్ర మీద తెలుగు రామాయణాల ప్రభావం లేదని నిరూపించడమే ఈ శీర్షిక ప్రధానోద్దేశం.

విశ్వనాథ వినూత్న దృక్పథంతో శబరి పాత్రను చిత్రించారు. తెలుగు రామాయణకర్తల్లో ఈ దృక్పథంతో శబరి పాత్ర సృజించిన వారరుదు. తెలుగు రామాయణకర్తల్లో చాల మంది వాల్మీకి యే అభిప్రాయంతో శబరి పాత్రను సృష్టించాడో అర్థంచేసుకోలేదని విశ్వనాథవారి ఆవేదన. (ఈ ఆవేదనను ఆయన What is Ramayana to me అనే ఆంగ్ల రచనలో వ్యక్తీకరించారు. నేను శ్రీమద్రామాయణం లోని శబరి అద్వైతి అనే శీర్షికలో వివరించాను) విశ్వనాథ వారి శబరి వాల్మీకి యే భావంతో శబరి పాత్ర సృష్టించినాడో ఆ భావానికి వ్యాఖ్యాన రూపం. ఆయన పాత్ర చిత్రణ నైపుణ్యానికి, ప్రసన్న ఆఖ్యాన శిల్పానికి, సంభావనా శైలికి నాటకీయతకు, ద్వైత అద్వైత తత్త్వానికి తన

అనుభూతికీ, జీవుని వేదనకు ప్రతిబింబంగా, వాల్మీకి మహర్షి భాషా సంక్రాంత ఋణం తీర్చుకోవాలన్న కృతజ్ఞతా భావంతో శబరి పాత్ర చిత్రణ కావించారే తప్ప తెలుగు రామాయణాల ప్రభావంతో చిత్రించలేదు. ఆయన తన రామాయణ అవతారికలో—

శా॥ "ఈ సంసార మిదెన్ని జన్మలకు నేనీ మౌని వాల్మీకి భా
షా సంక్రాంత ఋణంబుఁ దీర్పఁగలదా! సత్కావ్యనిర్మాణ రే
ఖా సామగ్రి ఋణంబుఁ దీర్పఁగలదా! కాకుత్స్థుఁడౌ స్వామి గా
థా సంపన్నము భక్తిఁ దీర్చినను ద్వైతా ద్వైత మార్గంబులన్[15]"

అని పేర్కొన్నారు. దీనిబట్టి ఆయన మీద వాల్మీకి ప్రభావం ఎంత ప్రబలంగా ఉందో తెలుస్తోంది. ద్వైతా ద్వైత మార్గంబుల ప్రస్తావనం చేయడంవల్ల ఆయన పాత్రలు ద్వైతా ద్వైత పరంగా ఉంటాయని వ్యంగ్యంగా సూచింపబడింది. ద్వైతా ద్వైత సిద్ధాంతాలకు ప్రతీకగా ఆయన శబరి పాత్ర చిత్రణ చేశారన వచ్చు. కవులు కావ్యావతారికలలో తమ కవితా సిద్ధాంతాల గురించి పేర్కొవడం ఒక సంప్రదాయం.

విశ్వనాథ వారు సంస్కృతంలో రామకథను కావ్యాలుగా నాటకాలుగా వ్రాసిన వారికి రామకథకు వ్యాఖ్యానాలు వ్రాసిన వారికి అంజలి ఘటించినారే తప్ప, తెలుగులో రామాయణాలు వ్రాసిన కవులకు ఒక్కరికి కూడా నమస్కరించక పోవడం గమనింపదగ్గ విషయం.

ఆ॥ "భాసకాళిదాస భవభూతి దిఙ్నాగు
లకుఁ బ్రశస్త వాగ్విలక్షణుఁడు ము
రారి భట్టునకును రామకథా భాష్య
కారులకును మోడ్పుకై ఘటించి "[16]

అని మోడ్పుకై ఘటించినారే తప్ప శతాధికులయిన తెలుగు రామాయణ కర్తలలో ఒక్కరిని గూడ పేర్కొలేదు. ఆయన ఆంధ్ర కవిలోక మూర్ధ మణులుగ, తనకు గురుస్థానీయులుగా నమస్కరించిన వారిలో రామాయణ కర్తలు లేక పోవడం ఆలోచనీయం.

సీ॥ "ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పపుఁదెనుఁగు తోఁట
యెఱ్ఱన్న సర్వ మార్గేచ్ఛా విధాతృండు
పోతన్న తెలుఁగుల పుణ్యపేటి
శ్రీ నాథుఁడు రస ప్రసిద్ధ ధారాధుని
కృష్ణరాయఁ డనన్య కృతి ప్రబంధ
పెద్దన్న వడ పోత పెట్టి నిక్షురసంబు
రామకృష్ణుఁడు సురారామగజము"

గీ॥ "ఒకడు నాచన సోమన్న, యుక్కి వుండు
చెఱిపి పదిసార్లు తిరుగ వ్రాసినను మొక్క
వోని యీ యాంధ్ర కవిలోక మూర్ధమణుల
మద్గురు స్థానములుగ నమస్కరించి."17

అని విశ్వనాథ వారు తనకు గురుస్థాన ములుగ కవి నవ రత్నాలకు నమస్క రించాడు.

వీరిలో నన్నయ్య రామాయణం జోలికే పోలేదు. తిక్కన్న నిర్వచనోత్తర రామాయణం రచించాడు. విశ్వనాథ ఉత్తరకాండ వ్రాయలేదు. ఎఱ్ఱన్న మాత్రం రామాయణాన్ని రచించినట్లు ప్రతీతి. కాని, అది అలభ్యం. కనుక, ఎఱ్ఱన్న రామాయణ ప్రభావం విశ్వనాథ వారి మీద ఉండటానికి అవకాశం లేదు. తెలుగుల పుణ్యపేటి అయిన పోతన్న తన భాగవతంలో రామకథ సంగ్రహంగా చెప్పాడు. భాగవతం ద్వితీయ స్కంధంలో రామావతార కథ సుమారు 18 పద్య గద్యాలలో చెప్పాడు. అది రామ కథకు చాలా సంక్షిప్త రూపం. అందులో శబరి ప్రస్తావన లేదు. కాబట్టి పోతన ప్రభావం శబరి పాత్రపై కనిపించదు. శ్రీనాథుడు, కృష్ణదేవరాయలు, పెద్దనాదులు రామాయణ రచన చేయలేదు. బహుశః వీరెవ్వరైనా రామాయణం వ్రాసి ఉంటే ఆ రామాయణ ప్రభావం విశ్వనాథ వారి మీద ఉండి ఉండేదేమో! స్థూల దృష్టితో చూస్తే విశ్వనాథ వారి మీద శతాధిక పూర్వాంధ్ర రామాయణ కర్తల ప్రభావం లేద నే చెప్పాలి.

అవతారికలో గురుస్థానీయులుగా నమస్కరించనంత మాత్రాన పూర్వాంధ్ర రామాయణ కర్తల ప్రభావం విశ్వనాథ మీద ఎందుకు ఉండ కూడదు! అని కొందరికి అనుమానం రావచ్చు. ప్రశ్నించవచ్చు. దానికి విశ్వనాథ వారే సమాధానం చెప్పారు. తన అనుభూతి తనదిగా తనభక్తి రచనలు తనవిగా రామకథ చెప్పదలచినట్లు వ్యక్తం చేశారు. ఈ ప్రపంచకము-

సీ॥ "... చేసిన సంసారమె చేయు చున్నది
తనదైన యనుభూతి తనది గాన
తలఁచిన రాముసే తలఁచెద నేనును
నా భక్తి రచనలు నావి గాన"...18

రామాయణాలు ఎన్నో వెలసినా తన అనుభూతికి ఆకృతిగా తన భక్తి రచన తనది అనే ముద్రపడే విధంగా తన పురాకృత ప్రతిభకు ప్రత్యక్ష సాక్ష్యంగా శ్రీమద్రామాయణ కల్పవృక్ష కృతిని రచించారే తప్ప పూర్వాంధ్ర రామాయణ కర్తల ప్రభావం తనపై ఉండేవిధంగా ఆయన రచన చేయలేదనడం స్పష్టం.

కావ్య అవతారికలో కవి తన రచనోద్దేశాన్ని స్పష్టపరచడం, తనపై ప్రభావం కలుగచేసిన పూర్వ కవులను స్తుతించడం, తన కావ్యశిల్పాన్ని, కావ్య రచనకు ప్రేరణ కలిగిన సందర్భాన్ని చెప్పుకోవడం ఒక సంప్రదాయం.

విశనాథవారు తన కావ్యావతారికలో ఏ సందర్భంలో గాని పూర్వాంధ్ర రామాయణ కర్తలను మచ్చుకుకూడా పేర్కొనక పోవడంలో కవి హృదయం స్పష్టంగా తెలుస్తూంది.

భాస, కాళిదాస, భవభూతి, దిఙ్నాగాదులను భక్తితో పేర్కొన్న విశ్వనాథ అభిమానంతో అయినా పూర్వాంధ్ర రామాయణకర్తలలో ఒక్కరినైనా పేర్కొనక పోవడం వలనగూడ తెలుగులో పూర్వం వెలసిన రామాయణాల దారి వేరు తన రామాయణ కల్పనాశిల్పం వేరని తెలుస్తూంది.

కల్పవృక్షంలోని శబరి పాత్రపై పూర్వాంధ్ర రామాయణాల ప్రభావం కనిపించదు కాని సుప్రసిద్ధ పూర్వాంధ్ర కవుల ప్రభావం కనిపిస్తుంది.

శబరి పాత్రప్రవేశ సందర్భం రామరాజ భూషణుని వసుచరిత్రలో వసు రాజును గిరికాదేవి ముందుకు ప్రవేశపెట్టిన సన్నివేశాన్ని స్ఫురింప చేస్తుంది.

మాయా మునివేషంలో ఉన్న వసురాజు మంత్రి తన మంత్ర ప్రభా వంతో వసురాజును ఇప్పుడే రప్పిస్తాను చూడండని గిరికతో చెలికత్తెలతో చెప్పి కపట మంత్రజపం నటించి దిక్కులు చూచి "మజ్ఝా" అనగానే

చం॥ "ఇది సంధింపంగ వేళ యంచు వసురాజేంద్రుడు నీరంధ్రన్
రదవార ప్రతిసీర వెల్వడిన శారాభ ర్లీలన్ లతా
చ్ఛదసంఛాదికఁ బాసి నిల్చె నెదుటన్ సారంగరాగభ్రమ
న్మద భృంగీరుతి వంది మాగధకథా మాధుర్యముందెల్పగన్."19

ప్రవేశిస్తాడు వసురాజు. దట్టమైన లతలు తుమ్మెదల గానం రంగస్థలం మీదికి పాత్ర ప్రవేశించేటప్పుడు కనిపించే తెర వినిపించే వాయిద్య విశేషాలు' 'మజ్ఝా' అనే ప్రస్తావన కనపిస్తాయి.

"ఇదే విధంగా కబంధోక్త మార్గాన వెళ్ళుతూన్న రామలక్ష్మణులు -

మ॥ ఎవరో వెన్కను రామయంచు బిలువన్ హీరాయితాక్షంబులన్
జివురుం జొంపము గాలికిన్ మలఁగెనా శ్రీరాముఁడీక్షించి యా
యెవరిం గానక నిల్చియుండ, ననుజుండే రాళమౌ నాగ్రమపుం
జివురుం గుత్తుల వెన్క జూపి హసన శ్రీగల్ల భాగంబులన్"20

'రామ,అని వెనుక ఎవరో పిలిచిన శబ్దం వినిపిస్తుందేకాని అటు తిరిగి చూస్తే ఎవరు కనిపించరు. చివురు జొంపములు, ఆమ్రమపు చివురుగుత్తులు వసుచరిత్ర లోని లతాచ్ఛాద సంఛాదికాన్ని స్ఫురింపచేస్తాయి. "రామ" అని వినిపించిన శబ్దం "మజ్ఝా" శబ్దాన్ని తలపింప చేస్తుంది. ఆ ప్రాంతమంతా రామనాథం విని పిస్తుంది కనుక ఇది తుమ్మెదల ఆరావాన్ని గుర్తుచేస్తుంది. లక్ష్మణుడు రామునితో ఇది శబర్యారావమే ఆయుఉంటుందంటాడు అప్పుడు రాముని మనస్సులో ఒక రూపం మెరుపులా మెరుస్తుంది

మధ్యాక్కఱ -

"మెడలోనఁ దులసి పేరొకటి, మెత్తని మేని విభూతి,
వడిఁ దియ్య విల్లాని కుసుమ బాణుండు బాణంబు చివర
సడలు రేకుల తమ్మి పూవు సంధించి, క్ష్మాసుతా విరహ
జడు మీఁద రాముని మీఁద జ్యావల్లి సారించి విడిచె"21

తెలిదమ్మి పూవు బాణం వలె నా యాత్మలో పడినట్లైంది. లక్ష్మణా శబరిని చూడాలనే కోర్కె మదిలో తారాడుతూంది అంటాడు రాముడు - అప్పుడే శబరి పూలుపండ్లు పేర్చిన పళ్ళికను శిరసుపై పెట్టుకొని ప్రవేశిస్తుంది.

ఇక్కడ సన్నివేశ సామ్యం లేదు. కాని నాటకీయంగా పాత్రను ప్రవేశ పెట్టటంలో సామ్యం కనిపిస్తూంది. ఇది కొందరికి "బోడినెత్తికి బొటనవేలికిముడి పెట్టినట్టు"ఉన్నదనిపించవచ్చు కాని లోతుగా అనుశీలిస్తే నాటకీయంగా పాత్రను ప్రవేశపెట్టడంలోని పోలికలను పసికట్టవచ్చు.

కల్పవృక్షంలోని శబరి పాత్ర చిత్రణంలో నన్నయ ప్రసన్నకథా కలితార్థయుక్తి ప్రభావం కనిపిస్తుంది. విశ్వనాథవారు శబరి ఉపాఖ్యానాన్ని ప్రసన్నతా కలితనముతో నడిపించడమే దీనికుదాహరణ.

శిల్పపు తెనుగుతోట తిక్కన ప్రభావం శబరిపాత్రపై సంవాద శైలిలో కనిపిస్తుంది. పాత్రల సంభాషణలతోనే కథను రమ్యంగా నడిపించడం అనే శిల్పానికి తిక్కన ఆద్యుడు. విశ్వనాథ అందెవేసినచేయి శబరి ప్రవేశంనుండి అగ్నిప్రవేశంవరకు రమ్యసంభాషణలతో ఇతివృత్తాన్ని నడిపించడం ఇందుకు తార్కాణం. ఇంకా అలతి అలతి సమాసాల్లో అనల్పార్థాలను చెప్పడంలో సందర్భోచిత ఛందస్సును ప్రయోగించటంలో తిక్కన ప్రభావం కనిపిస్తుంది.

మతంగాశ్రమ దృశ్యాలను వర్ణించే సందర్భంలో ఎఱ్ఱన మార్గచ్ఛాయలు విశ్వనాథలో కనిపిస్తాయి.

శబరి మధురభక్తిని చిత్రించే సందర్భంలో పోతన్న గోపికల భక్తి, వాత్సల్య భక్తితత్త్వంలో యశోద వాత్సల్య ప్రభావం శబరి పాత్రపై కనిపిస్తాయి.

సీసపద్యాల నడకలో శ్రీనాథుని అడుగుజాడలు, వేదాంత తత్త్వ విషయాల వ్యక్తీకరణంలో కృష్ణదేవరాయల ప్రభావం కనిపిస్తాయి.

అల్లసాని పెద్దన వడబోసిన ఇక్షురసాన్నికాదు కాని తత్త్వ సారాన్ని శబరి పాత్రలో పసికట్టవచ్చు. కల్పనా శిల్పంలో శబ్దాలంకార ప్రయోగంలో దీర్ఘసమాసాలతో ఓజోగుణం సాధించడంలో నాచనసోమన్న ప్రభావం విశ్వనాథ వారిపై కనిపిస్తుంది.

ఈవిధంగా పూర్వాంధ్ర ప్రసిద్ధకవుల ప్రభావం విశ్వనాథవారి శబరి ఖండరచనపై పాత్రపై కనిపిస్తుందేకాని పూర్వాంధ్ర రామాయణాల ప్రభావం శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని శబరి పాత్రపై అంతగా కనిపించదు.

## శబరిపాత్ర అందించే సందేశం

రామాయణంలో ప్రతిపాత్రా ఏదో ఒక సందేశానికి సంకేతంగా, ఏదో ఒక ఉదాత్త భావానికి ఉదాహరణంగా, ఏదో ఒక ఉత్కృష్ట ధర్మానికి ఉపమానంగా, ఏదోఒక లౌకిక సత్యసారానికి ప్రతీకాత్మకంగా, ఏదో ఒక ధర్మరహస్యానికి దోహదంచేసే విధంగా, అంతరార్థ గర్భితంగా సృజింపబడినవే అని చెప్పవచ్చు.

అబలత్వం కాని, అధమకులం గాని ధృఢవ్రతానికీ, తపోధనార్జనానికీ, సిద్ధిపొందడానికీ అడ్డంకులు కావనే సత్యసందేశానికి ప్రతీకగా రామాయణంలో శబరి పాత్ర రూపొందింప బడింది.

శబరి పూర్వాశ్రమ జీవితాన్ని గురించి ఎవరికితోచినట్లు వారూహించు కొనవలసిందే కాని ఆధారాలు అలభ్యం' మతంగ మహర్షి శిష్యురాలుగా, రామోపాసకురాలుగా రామాయణంలో శబరి కనిపిస్తుంది.

సద్గురు సేవ వల్ల కడజాతి వారుకానీ ఆడవారుకానీ జ్ఞానం గడించవచ్చు, సిద్ధిని పొందవచ్చు. దివ్యత్వాన్ని సాధింపవచ్చు అనే సందేశానికి సంకేతంగా శబరిని తీసుకోవచ్చు.

అద్వయ తారకోపనిషత్తులో గురు శబ్దం ఇలా నిర్వచింపబడి ఉంది-

శ్లో॥ "గుశబ్దం స్త్వన్ధకారస్స్యాత్ రుశబ్దస్తన్నిరోధకః
అన్ధకార నిరోధిత్వాత్ గురు రిత్యభి ధీయతే"[22]

"గు" అనగా - అజ్ఞానాంధకారము - "రు" అనగా దానిని తొలగింపువాడు-కావున అజ్ఞానాంధకారాన్ని పారద్రోలువాడు గురువనబడును. శబరి అజ్ఞానాంధకారంలో పుట్టి పెరిగి ఉండినా సద్గురువగు మతంగ మహర్షి సేవా భాగ్యం వల్ల ఆమె అజ్ఞాత జీవితంలోని అజ్ఞానాంధకారం తొలగించబడింది. జ్ఞాన జ్యోతి ఆమెలో వెలిగించబడింది. ఆ జ్ఞానసిద్ధితో భగవత్స్వరూపాన్ని దర్శించి ముక్తి పొందింది. కనుక, శబరి ముక్తికి ప్రాతిపదిక గురుశుశ్రూషే అనే సందేశం కూడా ఇందులో కనిపిస్తూంది.

ఇంకా ఆచార్య వైభవాన్ని గురించి శ్రీ వరవరమునీంద్రులు ఉపదేశ రత్నమాలలో ఇలా నిర్వచించారు—

పా. "జ్ఞాన మనుట్టానమి వైనన్దాగ వేయుడయ
నాన, గురు వైయడైన్దక్కాల్ మాలత్తర్
లేనార్ కనులత్తిరు మామల్ళ్క్కొళి సన్
తానే వైగున్దమ్ తరుమ్॥"

తా॥ భూమిలో నివసించు మానవులారా! జ్ఞానానుష్ఠాన సంపన్నులగు ఆచార్యుల నాశ్రయించినచో భగవంతుడు తానే స్వయముగ పరమపదము నొసంగును;23

ఈ ప్రవచనం శబరి విషయంలో అక్షర సత్యమైంది.

శబరి గురు శరణాగతివల్ల జ్ఞానసిద్ధిని రామ శరణాగతివలన దివ్యత్వ సిద్ధిని పొందింది. శరణాగతి అనగా 'అన్యథా శరణం నాస్తి' అని త్రికరణ శుద్ధిగా అవస్థాత్రయంలో గూడ ఆత్మను భగవదర్పితం చేయడం. రామాయణం దీర్ఘశరణాగతి సమన్వితమైంది. అందులో విశిష్టమైంది విభీషణుని శరణాగతి కాగా, శ్రేష్ఠమైంది శబరి శరణాగతి అని చెప్పవచ్చు. కారణం ఆమెది నిస్వార్థ శరణాగతి కావటమే.

శబరిని గురించి డా॥ ఇలపావులూరి పాండురంగారావు గారు-

"శబరి వృత్తాంతం భక్తికీ, శక్తికీ, కూడా ఆలవాలమైన రసవత్తర రమ్య గాథ. శబరి ఎంగిలి వాల్మీకి సూచించకపోయినా భక్తకవులు ఊహించారు. భక్తు

లపై భగవంతునికి గల అనురాగానికీ, అనుగ్రహానికీ, శబరి కథ శాశ్వతంగా నిలచిపోయింది. అనాహత నాదంనుండి విశుద్ధ చక్రంలో వాగ్విభూతికి దారిచూపే సన్నని తామర తూడుగా శబరిని భావిస్తే రామాయణంలోని శక్తి సందర్శనం స్పష్టంగా గోచరిస్తుంది. మామూలు కథగా చెప్పుకొని ఆటల్లో, పాటల్లో, నృత్య నాటికల్లో పామర రంజకంగా భావించేందుకు కూడా శబరి కథ చక్కగా ఉపకరిస్తుంది"[24] అని శబరి అందించే సందేశాన్ని వివరించారు.

డా॥ వేదుల సత్యనారాయణగారు—

"శబరి దేహం చాలించడానికై రాముణ్ణి చూస్తూ అగ్నిప్రవేశం చేసి స్వర్గానికి పోయింది; అంటే స్వయం ప్రకాశంతో ఆత్మానందానుభూతితో దేహ త్యాగం తర్వాతనే ముక్తిని పొందడం జరగాలి. అన్న సాధనా రహస్యాన్ని వాల్మీకి శబరీ వృత్తాంతంలో మనకు అంతరార్థపరంగా చెప్పాడని భావించాలి.[25] అని శబరి పాత్ర అందించే సందేశాన్ని పేర్కొన్నారు.

డా॥ మల్లాది గోపాలకృష్ణ శర్మగారు—

"శ్రీమద్ రామాయణ కాలమున, పురుషులతో సమానముగ స్త్రీలనుగూడ అవివాహితలుగా నుండి, దీర్ఘ బ్రహ్మచర్య మవలంబించి, గురువుల నాశ్రయించి తీవ్రమగు యోగ సాధనలు చేయుటకు, వైరాగ్యమున్నచో శ్రమణిగ (సన్యాసినిగ) నుండి ఇంద్రియ జయము గావించి తీవ్రమగు తపోవ్రతాదుల ననుష్ఠించుటకు, ఆత్మ జ్ఞానము నందుటకు మహర్షులను నుతించినట్లు అవగత మగుచున్నది. ఆత్మ విజ్ఞానమును పొందుటకు పురుషులతో సమానముగ స్త్రీలు ప్రయత్నించుట నిషిద్ధము కాదనియును, మానవ మాత్రునకు ఆత్మ విజ్ఞానము నందుట కధికారము గలదని గూడ మనకు స్పష్టముగా తెలియుచున్నది."[26] అని తెలిపారు. ఇదియథార్థం.

శబరి పాత్రమధురాద్వైతాన్ని గురించి డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారు-

"శబరి వంటి ముగ్ధ భక్తులకు జ్ఞానం అవసరం లేదు. స్వామి యొక్క పరమ కరుణా స్వరూపాన్ని మనస్సులో భావించి పత్రం, పుష్పం, ఫలం,

తోయం తనకున్నది స్వామికి భక్తితో అర్పించి తృప్తి పడడం సహజ లక్షణం. ఆ ప్రవృత్తితో భజిస్తే ఎంత అధమ జీవినైనా స్వామి స్వయంగా నడచి వచ్చి కరుణిస్తాడు. శబరి తాను రుచి చూచిన పండ్లను రాముని కర్పించిందనీ, వాటిని రాముడు గ్రహించి ఆప్యాయంగా ఆరగించాడనీ కొన్ని కథలున్నాయి. అందులో "ఆత్మవత్ సర్వభూతాని"- అని భావించే మధురాద్వైత తత్త్వం ఇమిడిఉంది.[27] అని ప్రవచించారు. వీరి ప్రవచనం సత్య సమన్వితం.

శ్లో॥ "సర్వధర్మాన్పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహంత్వా సర్వ పాపేభ్యోమోక్షయిష్యామి మాశుచః"[28]

అని భగవద్గీతలో చెప్పబడిన చరమ శ్లోక పరమార్థానికి ప్రతిరూపంగా శబరి పాత్ర తత్త్వం దర్శనమిస్తుంది. సర్వపరిత్యాగ దృఢ వ్రతంతో, పరమేశ్వర దర్శన, స్పర్శన భాషణాదులే పరమార్థంగా భావించి తపోనిష్ఠతో వర్తించే జీవాత్మనన్వేషిస్తూ పరమాత్మ వచ్చి దర్శనమిస్తాడన్న పరమ సత్యాన్ని ప్రతీకాత్మకంగా ప్రబోధించడమే శబరి పాత్ర అందించే సందేశం. అటువంటి పవిత్రాత్మయే పరమాత్మకు తృప్తి కలిగించగలదనడమే శబరి ఆతిథ్యంలోని అంతరార్థం. సిద్ధి పొందిన జీవాత్మ, పరమాత్మ దర్శనంతో దివ్యత్వం పొందుతుందన్న తత్త్వ సిద్ధాంతానికి సంకేతమే శబరి ముక్తి ఫలప్రాప్తి. జీవుని వేదనలో ఆకృతి దాల్చిన ఒక వెలుగు రేఖయే శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని శబరి పాత్ర.

# ఉపసంహారం

ఈ పరిశోధనా యుగంలో ఒక చిన్న పాత్రను పరిశోధనాంశంగా ఎన్ను కోవడం ఒక క్రొత్త ప్రయోగం లాంటిదనే చెప్పాలి. "శ్రీమద్రామాయణ కల్ప వృక్షం శబరిపాత్ర-ఒక పరిశీలనం" అనే ఈ పరి శోధనావ్యాసాన్ని నాలుగు ప్రధానభాగాలుగ వింగడించి పదిహేను అంశాలను గురించి చర్చించడం జరిగింది.

ప్రథమ ప్రకరణంలో - తొలిఅంశంగా రామాయణ ప్రాశస్త్యాన్ని పేర్కొని రెండవఅంశంలో వాల్మీకి రామాయణంలోని శబరి పాత్రనుగురించి విపులంగా చర్చించి కథాగతిలో ఆ పాత్రస్థానం నిరూపించి కావ్యలక్షణాలను అనుశీలించడం అయింది. మూడోఅంశంగా శబరి భక్తిని గురించి విపులంగా చర్చచేసి నవవిధ భక్తితత్త్వాలు శబరికి ఎలా అనువర్తిస్తాయో అనుశీలించాను.

ద్వితీయ ప్రకరణంలో అధ్యాత్మ పాత్రనుగురించి వివరంగా చర్చించి రామాయణంలోని శబరి పాత్రను గురించి వివరంగా చర్చించి అధ్యాత్మ రామా యణం ఒక తాత్విక కావ్యంగా పేర్కోవడం,శబరి శ్రీరామునికిచ్చిన ఆతిథ్యాన్ని గురించి బహుళంగా చర్చించడం, వాల్మీకి అధ్యాత్మ రామాయణాలలోని శబరి పాత్రకు గల భేద సాదృశ్యాలను ప్రతి అంశంలోను అనుశీలించి ఏఏ అంశాల్లో భేద సాదృశ్యాలున్నాయో నిర్ధారించడం జరిగింది. శ్రీమద్రామాయణ కల్ప వృక్షా నికి మూలం వాల్మీకి రామాయణం కావడంచేత అధ్యాత్మ రామాయణ ప్రభావం కల్పవృక్షంపై కనిపించడంచేత ఈ రెండు రామాయణాల్లోని శబరి పాత్రను గురించి విపులంగా చర్చించాను.

తృతీయ ప్రకరణంలో - శ్రీమద్రామాయణ కల్పవృక్షం, "శిల్పవృక్షం" కూడా అని నిరూపించడమైంది. కొన్ని తెలుగు రామాయణాల్లో శబరి పాత్రను రేఖామాత్రంగా పరిశీలించి శబరి ఖండ వైశిష్ట్యాన్ని నిర్ణయించడం, శబరి

పాత్రను విశ్వనాథవారు ఎలాంటి వైలక్షణ్యంతో సృజించారో విశ్లేషణాత్మకంగా చర్చించి విశ్వనాథవారి శబరి భక్తితత్త్వం నిర్ధారణ చేయబడింది.

చతుర్థ ప్రకరణంలో శ్రీమద్రామాయణ కల్పవృక్షంలోని శబరి పాత్రపై వాల్మీకి రామాయణ ప్రభావాన్ని పరిశీలించి వాల్మీకి శబరికి కల్పవృక్షంలోని శబరి వ్యాఖ్యానరూపం అని నిర్ధరించడం జరిగింది. విశ్వనాథవారి శబరి చారుభాషిణిత్వాన్ని చర్చించి అధ్యాత్మ రామాయణంలోని శబరి పాత్రప్రభావం కల్పవృక్షంలోని శబరిపై ఏ సందర్భాల్లో ఉందో చూపబడింది. తెలుగు రామాయణాల ప్రభావం విశ్వనాథ శబరిపై కనిపించదని పూర్వాంధ్ర ప్రసిద్ధ కవులయిన నన్నయ, తిక్కన, శ్రీనాథ, పోతన, పెద్దన, రామరాజభూషణ కృష్ణదేవరాయ నాచనసోమనాథుల ప్రభావం ఉందని సూచింపబడింది.

ఈ విధంగా "శ్రీమద్రామాయణ కల్పవృక్షం" శబరి పాత్ర ఒక పరిశీలన అనే పరిశోధనాంశాల్ని విశ్లేషణాత్మకంగా అనుశీలించి శబరి పాత్ర ప్రయోజనాన్ని, భక్తితత్త్వాన్ని, విశ్వనాథవారి శబరి పాత్ర వైలక్షణ్యాన్ని నిర్ధరించడం జరిగింది. విశ్వనాథ కల్పవృక్షానికి పూసిన ఒక భక్తి సుమంలోని పరిమళాన్ని ఒక పరివేషంలో పదిలపరచడం జరిగింది. ఈ సౌరభ వైభవాన్ని సహృదయులు సమ్మానిస్తారని విశ్వసిస్తున్నాను.

# అధోజ్ఞాపికలు

## చతుర్థ ప్రకరణం

1. వాల్మీకి రామాయణము, అరణ్యకాండ, సర్గ - 74 శ్లోకం - 11.
2. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షము, అరణ్య కాండము, శబరి ఖండము, పుట - 321, పద్యం - 338.
3. నన్నయ్య, శ్రీమహాభారతము, ఆదిపర్వం, పుట - 49, పద్యం - 528 బి.వి. అండుసన్స్, రామారావుపేట, కాకినాడ, 1968.
4. బమ్మెర పోతనామాత్యుడు, శ్రీమహాభాగవతం, దశమస్కంధం పద్యం - 302.
5. ధరణి దేవుల రామయామాత్యుడు, దశావతార చరిత్రము, ఆశ్వాసం - 3వ పద్యం - 49.
6. తరిగొండ వేంకమాంబ, వేంకటాచల మాహాత్మ్యం ఆశ్వాసం - 5వ, పద్యం - 4.
7. వాల్మీకి రామాయణం, అరణ్యకాండ 74 వ సర్గ, శ్లోకం - 25.
8. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షం అరణ్యకాండ, శబరి ఖండం, పుట - 325, పద్యం - 362.
9. విశ్వనాథ సత్యనారాయణ, కల్పవృక్ష రహస్యములు, పుట - 28 సత్య నారాయణ P. S. & Co. గుంటూరు.
10. అధ్యాత్మ రామాయణం, అరణ్యకాండ, పదవ, సర్గ, శ్లోకం 6.
11. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, అరణ్య కాండం, శబరి ఖండం, పుట - 325, పద్యం - 559.
12. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, అరణ్య కాండం, శబరి ఖండం పుట-320, పద్యం-335.
13. అధ్యాత్మ రామాయణం, అరణ్యకాండ, దశమసర్గ శ్లోకం-9.

14. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, అరణ్యకాండ, శబరిఖండం, పుట 320, పద్యం-334.
15. Ibid - అవతారిక - పుట 9, పద్యం-34.
16. Ibid - ,, - పుట 9, పద్యం-31.
17. Ibid - ,, - పుట 38, పద్యం-30.
18. Ibid - ,, - పుట 4, పద్యం-5.
19. రామరాజ భూషణుడు, వసుచరిత్ర, తృతీయాశ్వాసం పద్యం - 45, వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, చెన్నపురి-1962.
20. విశ్వనాథ సత్యనారాయణ, శ్రీమద్రామాయణ కల్పవృక్షం, అరణ్య కాండ శబరిఖండం, పుట 319 పద్యం-328,
21. Ibid - పద్యం-331.
22. గోపాలాచార్య-శబరి, పుట-33, శ్రీమదుభయ వేదాన్తాచార్య పీఠము ట్రస్టు-నడిగడ్డ పాలెం-పిన్‌కోడ్-522318.
23. గోపాలాచార్య, శబరి, పుట-75.
24. డా॥ ఇలపావులూరి పాండురంగారావు, రామాయణ పరమార్థం, పుట-46, యువభారతి, సికిందరాబాద్-3.
25. డా॥ వేదుల సత్యనారాయణ, అంతరార్థ రామాయణం పుట-83, శ్రీవాణీ నిలయం, టౌనుహాలు వెనుకవీధి, తణుకు పశ్చిమ గోదావరి జిల్లా-
26. డా॥ మల్లాది గోపాలకృష్ణ శర్మ, శ్రీమత్ రామాయణ వైభవము, ఆర్ష భారతీ ప్రకాశన్, అనంతవరం, తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా.
27. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం, రామకథ సాయిసుధ, పుట 212, హైదరాబాద్.
28 శ్రీమద్భగవద్గీత, 18 వ అధ్యాయ, శ్లోకం నెం. 66.

# ఉపయుక్త గ్రంథ సూచిక


1. అప్పలస్వామి, పురిపండా; వ్యావహారికాంధ్ర రామాయణము, కొండపల్లి వీరవెంకయ్య అండు సన్సు; రాజమండ్రి - 1967.
2. అమృతవాహిని (భక్తిసూక్తుల సంకలనం) రెండవ సంపుటం సర్వోదయాశ్రమము, సర్వేలు - 1969.
3. ఉదయభాస్కరం, బులుసు, శ్రీమదానంద రామాయణము; వచనము, రాజానగరము, రాజమండ్రి - 1969.
4. డా॥ గోపాలకృష్ణశర్మ, మల్లాది, శ్రీమత్‌రామాయణ వైభవము (సమాలోచనాత్మ వ్యాస సంపుటి -) ఆర్య భారతీప్రకాశన్, అనంతవరం, గుంటూరు జిల్లా - 1971.
5. గోపాలాచార్య - శబరి, శ్రీమదభయవేదాంతచార్య పీఠము ట్రస్టు; నడిగడ్డపాలెం, చుండూరు - 1981.
6. గౌతమరావు, జువ్వాడి; విశ్వనాథ కవితా వైభవము, యువభారతి సికిందరాబాద్-1974.
7. తిమ్మకవి, కూచిమంచి; అచ్చతెలుగు రామాయణము, వావిళ్ళ రామస్వామి అండు సన్సు - చెన్నపురి-1954.
8. దీక్షితులు చింతా (శబరి నాటకము) రజిత ముద్రా యింత్రము తెనాలి-1926.
9 నరసింహావధానులు, ములుకుట్ల; శ్రీరామాయణ సారోద్ధారము, అరణ్యకాండము, ఆంధ్ర తాత్పర్యము, అనంత పబ్లికేషన్సు, బగింగ్‌హామ్‌పేట, విజయవాడ-2
10. పాండురంగారావు, ఇలపావులూరి, రామాయణ పరమార్థం యువభారతి, సికందరాబాద్-1983.
11. పోతన, బమ్మెర; శ్రీమహాభాగవతము (మొదటి సంపుటి) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్-4, జనవరి 1977, తృతీయ ముద్రణ.

12. ప్రతాపరెడ్డి, సురవరం; రామాయణ విశేషాలు, ఆంధ్ర రచయితల సంఘం, హైదరాబాద్.

13. బుచ్చి సుందర రామమూర్తి, మాధవపెద్ది; శబరి (కావ్యము) శ్రీ సత్య న్నారాయణ బుక్ డిపో, రాజమండ్రి-1951.

14. భాస్కరుడు, హుళిక్కి; భాస్కర రామాయణము, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, చెన్నపురి.

15. మొల్ల, ఆతుకూరి; మొల్ల రామాయణం. వావిళ్ళ రామస్వామి అండ్ సన్సు, చెన్నపురి-1968.

16. రామకోటయ్య చౌదరి, వెలగ (అనువాదకుడు) శబరి నవల (హిందీ మూలం బాలశౌరిరెడ్డి) శ్రీ వేణు పబ్లికేషన్సు, మద్రాసు-19.

17. రామకృష్ణశర్మ, గడియారం; (కూర్పరి) దశరూపకసారం ఆంధ్ర సారస్వతపరిషత్తు, తృతీయముద్రణ - 1966.

18. రామానుజాచార్యులు, గుదిమెళ్ళ; శబరి (కావ్యం) శ్రీవాసుదాసాశ్రమము నడిగడ్డపాలెం, పంచమ ముద్రణ, 1977.

19. రామమూర్తి, పురాపండ; అధ్యాత్మరామాయణము, ఆంధ్రవ్యాఖ్యాన సహితం, ఆధ్యాత్మ ప్రచారకసంఘము, దేవాలయంవీధి, కాకినాడ, ప్రథమ ముద్రణ, మన్మథవసంతము - 1955.

20. రామరాజభూషణుడు, వసుచరిత్రము, (సవ్యాఖ్యానము) వావిళ్ళ రామ స్వామి శాస్త్రులు అండు సన్సు - చెన్నపురి, 1962.

21. లక్ష్మీనరసయ్య, వేలంపాటి. (అనువాదకుడు) వి. యస్. శ్రీనివాసశాస్త్రి ఆంగ్లమూలం, రామాయణ ఉపన్యాసములు, ప్రథమ సంపుటి, అనువాద కుడు, మాలవ్యనగర్, గూడూరు, ప్రథమముద్రణ - మార్చి 1981.

22. వరదరాజులు, కట్టా; శ్రీరామాయణము, ద్విపదకావ్యము, మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్‌సీరిస్ నెం - 1 - 1952.

23. వేంకటకృష్ణయ్య, తాటికొండ; ప్రభాకరరావు, ముదివేడు; బ్రాహ్మీమయ మూర్తి, (విశ్వనాథ సాహితీదర్శనం) వ్యాససంకలనం, విశ్వభారతి ప్రచురణ, తిరుపతి, ప్రథమ ముద్రణ 1973.

22. శమంతకమణి, పండా; తెలుగు సాహిత్యంలో రామకథ, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాద్ - ప్రథమముద్రణ 1972.

26. శేషాచార్యులు, గట్టుపల్లి; వాల్మీకి రామాయణము, (కూర్పరి) బాలకాండము, శశిరేఖా ముద్రాక్షరశాల, చెన్నపురి - 1918.

26. శేషాచార్యులు, గట్టుపల్లి (కూర్పరి) వాల్మీకి రామాయణము, అరణ్య కాండము, శశిరేఖాముద్రశాల, చెన్నపురి 1918.

27. శ్రీరాములరెడ్డి, పూతలపట్టు; కంబరామాయణము, ప్రగతి ప్రచురణ, ఖైరతాబాద్, హైదరాబాద్-4

28. శ్రీనివాస సోదరులు; శబరి ఖండకావ్యము, వేంకటరామా ప్రెస్ వేలూరు-1943

29. సత్యనారాయణ,విశ్వనాథ; శ్రీమద్రామాయణ కల్పవృక్షము, బాలకాండము వల్లీపబ్లికేషన్స్, మారుతీనగర్, విజయవాడ-4 పంచమ ముద్రణ-1976

30. సత్యనారాయణ, విశ్వనాథ; శ్రీమద్రామాయణ కల్పవృక్షము అరణ్య కాండము, వల్లీపబ్లికేషన్స్, మారుతీనగర్, విజయవాడ - 4 పంచమ ముద్రణ - 1976

31. సత్యనారాయణ, విశ్వనాథ; కల్పవృక్ష రహస్యములు P.S. అండుకో, గుంటూరు - ఫిబ్రవరి 1976

32. సత్యనారాయణ శాస్త్రి, మధునాపంతుల; తెలుగులో రామాయణాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్ - 4

33. సూర్యనారాయణ, వేదుల; అంతరార్థరామాయణం శ్రీవాణీ నిలయం, టౌనుహాలు వెనుకవీధి, తణుకు, పశ్చిమగోదావరి జిల్లా-ప్రథమముద్రణ...

34. సుబ్బారావు, వావిలికొలను; శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము, మందర వ్యాఖ్యా, అరణ్యకాండము. శ్రీకోదండ రామసేవక ధర్మసమాజము, అంగలకుదురు, తెనాలి.

35. సుబ్రహ్మణ్యం, డా॥ జి. వి; నవ్యాలోకం, సాహితీవ్యాస సంపుటి, శ్రీవాణీ ప్రచురణ, ప్రథమ ముద్రణ - 1972.

36. సుబ్రహ్మణ్యం, డా॥ జి. వి; రామకథ-సాయిసుధా, శ్రీసత్యసేవా సమితి, హైదరాబాద్-ప్రథమ ముద్రణ-ఏప్రెల్ 1982.

37. సుబ్రహ్మణ్యం, డా॥ జి. వి; అభినవ లోచనం, యువభారతి, సికింద్రాబాద్ - 3, 1983.

38. సుబ్రహ్మణ్యం, డా॥ జి. వి. ప్రధాన సంపాదకులు రామాయణ సుధా లహరి, యువభారతి, సికిందరబాద్-3. 1976.

39. సుబ్రహ్మణ్యం డా॥ జి. వి; సారస్వత వ్యాసములు, 3 వ సంపుటము, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమి, హైదరాబాద్-4.

40. సోమశేఖరశర్మ, మల్లంపల్లి; వేంకటరంగాచార్యులు,తిరుమల;(పరిష్కర్తలు) రంగానాథ రామాయణము, ద్విపద కావ్యము, రాయల్ అండుకో-ఎడ్యు కేషనల్ పబ్లిషర్స్ కడప, ద్వితీయ ముద్రణ - 1957.

41. హరి, కూచిబొట్ల; శ్రీనాథ మహాకవి కావ్యకళ, గ్రంథకర్త, ధర్మపురి, కరీంనగర్ - పథమముద్రణ - 1976.

## సాహిత్య పత్రికలు

1. భారతి, సాహిత్య మాసపత్రిక - మే 1936

2. సప్తగిరి, తిరుపతి దేవస్థాన సచిత్ర మాసపత్రిక - ఏప్రెల్ 1983.

3. ప్రవంతి, మాసపత్రిక, దక్షణ భారత హిందీ ప్రచార సభ, హైదరాబాద్ - ఏప్రెల్ - 1959.

# ఆంగ్ల గ్రంథాలు


1. A history of Indian Literature, Vol. Part II second edition - 1963.
2. Alois Wurm, Ph. D., Thesis, charecter portrayals in the Ramayana of Valmiki, A systematic Representation Alois Wurm - 1976. Ajanta Publication (India) Delhi - 110 007.
3. Hariprasad Shastri, (translator) of The Ramayana of Valmiki Vol. II, Santi Sadan, 29 Chepstov villas, London - II - 1957.
4. Makhanlal Sen, (translator) The Ramayana of Valmiki original Sanskrit, Manshirom Manoharlal Publishers Private Limited, 54, Rani Jansi Road, New Delhi - 110 055.
5. Raja Gopalachary, C. Ramayana, Bharatiya Vidya Bhavan, Chaupatty, Bombay - 1957.
6 Sathyanarayana Viswanatha Dr., Viswanatha Pavani Sastry, Maruthinagar, Vijayawada-520 004.
7. Swami Vivekananda, The complete works-Volume No. IV Mayavati memorial Edition, Advaita Ashramam, 5, Dehienctally Road, Calcutta.
8. VettamMani, Puranic encyclopaedia Motilal Banarsidass, Indological Publishers, Bengalow Road, Jawahar Nagar, Delhi - 7 - 1979.



## గోళ్ళ కుమారస్వామి నాయుడు

పుట్టింది పక్కా పల్లెటూరు బెల్లం గోవిందు పల్లె - రైతు కుటుంబం. ప్రాథమిక విద్య ఎల్లంపల్లె, కట్టకిందపల్లె, హైస్కూల్ చదువు ఐరాల.

ఆంధ్ర సారస్వతాన్ని ప్రసాదించింది ఆంధ్ర సారస్వత పరిషత్. బి.ఏ., ఎం.ఏ., ఉస్మానియా విశ్వవిద్యాలయం. ఎం.ఫిల్ హైద్రాబాద్ విశ్వ విద్యాలయం (Central University). ప్రస్తుత నివాసం- హైదరాబాద్.

ఉద్యోగం - గతంలో హైదరాబాద్, బోధన్. ప్రస్తుతం ఉన్నత విద్యాసంచాలకుల కార్యాలయం (Directorate of Higher Education) హైదరాబాద్.

నూనుగు మీసాలనాటి నుండి యువభారతితో సన్నిహిత సంబంధం. సంయుక్త కార్యదర్శిగా బాధ్యతా నిర్వాహణ.

ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి లాంటి ప్రసిద్ధ తెలుగు పత్రికలలో గత పదేళ్ళుగా జి.కె. నాయుడు పేరుతో రచనలు ప్రచురిత మౌతున్నాయి. ఆకాశవాణి హైద్రాబాద్ కేంద్రంనుండి ప్రసారమౌతున్నాయి.

ఉషస్సు, స్వరాలు అనే యువభారతి కవితా సంకలనాలలో సహరచయిత.

"పువ్వులు నవ్వుతున్నాయి" కవితా సంకలనం 1981 లో ప్రచురితమైంది.